

# భక్త జయదేవ

( నాటకము )



గ్రంథకర్త

భట్టిప్రోలు జయరామారావు, బి. ఏ.



ముద్రి॥

శ్రీ దత్తా ప్రెస్

సికింద్రాబాదు

మన్మథ-ఉగాది

వెల : రూపాయి

# అంకితం

వాత్సల్యశీలి, సహృదయులునగు మా జనకులు
మ. రా. శ్రీ భట్టిప్రోలు రాధాకృష్ణయ్య గారికి
భక్తి పురస్సరముగ సమర్పించు కొనుచున్నాను.

భ. జ.

# తొలిపలుకు

నాకు ప్రియతమమైన యితివృత్తాలలో 'భక్త జయదేవ' ఒకటి. మహాకవి జయదేవులు విస్మరింపఁబడుచున్నట్లు తోఁచుటచేతను, వారి రచనా ప్రౌఢిమను - దాని ఔచిత్యమును అవగాహన చేసికొనఁగల ఉదారాశయుల కలిమి కన్పట్టనందునను, జయదేవ రచితములైన అష్టపదులను - అంతరాంగియున్న అమృతోపమానమైన రస నిధులను ఆవిష్కరింపఁదలంచిన నేను వారి జీవితమును నాకు తోఁచినట్లు నాటక రూపమున చిత్రింపఁబూనుకొని నేటికి ముగింపఁగలిగితిని. ఈ నాటకమందు ప్రస్ఫుటమగునది నృత్య సంగీత విభవము. కారణము : ఆ జయదేవ కవి సార్వభౌముఁడే తన చక్రవర్తిత్వమును "పద్మావతీ చరణచారణ చక్రవర్తి" అని స్థాపించుకొనుట యందే నిలిచియున్నది.

ఇట్టి మహోత్కృష్ట కళావిలసితమైన జయదేవ చరిత్రము నాటక రూపమున పరిజాదరణము పొందఁగలదని నానమ్మిక.

భట్టిప్రోలు జయరామారావు

# కృతజ్ఞత

నా ఆప్త కోటిలోనివారును, నాహితచింతకులును అగుచు నారచ
లన్నింటిని ఉదారాశయంతో ప్రచురింపఁబూనిన మ. రా. శ్రీ చంద్రమౌ
అప్పారావు గారికిని...

ముఖ్యముగా ఈ నాటకరచనమునకు ప్రోత్సహించి వ్రాయింపించి
మిత్రులు చెఱుకూరి రాధాకృష్ణమూర్తి, మట్టెగుంట లక్ష్మీనారాయణగా
కిని...

ఈనాటక ప్రథమప్రదర్శనమునకు పూనుకొని, జయప్రదంగా ని
హించుచున్న మ. రా. శ్రీ జూలూరి వీరేశలింగం గుప్త గారికి, శిర్నాం స
నారాయణ గుప్త గారికిని...

ముఖ్యముగా " శ్రీకన్యకా కళాక్షేత్రము_సభ్యులందఱికిని...

భ. జ.

# అభిప్రాయము

శ్రీ భట్టిప్రోలు జయరామారావు రచించిన 'శ్రీ భక్తజయదేవ' నాటకమును సాంగోపాంగముగ చదివితిని. ఇందలి భాషాశైలి, సలక్షణముగ, లలితమై ధారాశుద్ధిగలదియై పాఠక లోకానికి మనోరంజకముగా నున్నది. పాత్రోచిత రసానుగుణమగు పద్ధతితో ప్రేక్షకులకు, ఆనంద దాయకముగ నున్నది.

శారద పాత్రను సందర్భాను సారముగ చిత్రించి గ్రంధకర్త తన కల్పనాచాతుర్యమును విశదీకరించినారు. పరమేశ్వరుడు భక్తజన పోషకుడని, వారల కతీతుడు కాడని నిరూపించుటలో నిపుణత్వమును వ్యక్తీకరించినారు.

యువకులయ్యు భక్తిరస ప్రాధాన్యముగ, ఈ గ్రంధమును వ్రాసి ప్రజాలోకమునకు సమర్పించిన గ్రంధ కర్తకు భగవంతు డాయు రారోగ్య సంపత్తిని చేకూర్చి రక్షించుగాక ! ఈయనఘున కిట్టి సద్గ్రంధముల నింకను పెక్కులు రచించు శక్తి సామర్థ్యముల నొసంగుగాక.

సికింద్రాబాదు.
మన్మథ ఉగాది

చంద్రమౌళి అప్పారావు.

# ప్రథమ ద్వితీయ ప్రదర్శనములు

సికింద్రాబాదు, హైద్రాబాదు నగరములలో మన్మథ చైత్రమందు ప్రదర్శింప బడెను.

## ఇందు పాల్గొనిన నటీనటులు

| | |
|---|---|
| జయదేవుడు:- | శ్రీ మట్టిగుంట లక్ష్మీనారాయణ |
| పరాశరుడు:- | " గుదిమెళ్ల గోపాల కృష్ణమాచార్య |
| లక్ష్మణసేనుడు:- | " ఉప్పల కృష్ణమాచార్య |
| గోవర్ధనుడు:- | " దావులూరి రాధాకృష్ణమూర్తి |
| ధోయి:- | " అచ్యుతుని నారాయణరావు |
| శారద:- | చిరంజీవి కె. సుబ్బలక్ష్మి |
| పద్మావతి:- | కుమారి సులోచన (మద్రాసు) |
| వినయరక్షిత:- | శ్రీమతి చంద్రకాంత |

శ్రీ

# భక్త జయదేవ

## మొదటి రంగము

---

## బింము బిల్వక్షేత్రము

జయదేవుని మందిరం. సమయం - ప్రభాతం.

తెర యెత్తఁబడును.

(పద్మావతి పెరుగు చిలుకుచు సంకీర్తనము ఒనర్చుట)

పాట

పద్మావతి: "ఆలవి పాలివి తోడుకొన్నవి
తీయని పెరుగే చేయగవలెరా
నందనందనా! నవనీతచోరా!
రాకుర దరికి రాజీవాక్షా
తొలఁగుతొలఁగురా తుంటరి కృష్ణా!
తొందరచే మకు-మా-దారవాదోయి...

(పాట మధ్యలో శారద పూబంతితో ప్రవేశించు)

శారద: అహో! అత్తయ్యిప్పుడే ఆనందంలో అవశురాలైంది! పలుకరించినా పలికే స్థితిలో లేదు. అదృష్టమంటే నీదేనమ్మా!

(చేతిలోని పూబంతిని ఎగురవేయుచు ఆమెను సమీపించుచుండును. ఆమె శారదనే కృష్ణునిగా భావించును. శారద ఆమె కొంగు పట్టుకొని హెచ్చరికగా లాగును.)

పద్మావతి: "తొలఁగు తొలఁగురా తుంటరి కృష్ణా
విడు విడు చేతన దేమిరా, కృష్ణా! కృష్ణా!
క్షీరభాండమిటు చిదుకగనేయుదే" తొలఁగు...

శారద : ఏమమ్మా !

పద్మావతి : (శారద బుగ్గ నులుముచు)
"బుగ్గలు పిండీ బూరెలు వండెద
బుద్ధికలిగి ఉ దేవా బుడుతా ఇక బుద్ధికలిగి..."

శారద : అమ్మా, యశోదమ్మా ! నీకో వేయిదణ్ణాలమ్మా !

పద్మావతి : "ఇక బుద్ధికలిగి ఉండేవా" (చెంపలు వాయించుచు)
రెండిటు మూడిటు వాయించేదా
తెఱచిన నోరిటు మూయించేదా !

(నోటిలో వెన్న పెట్టి చెంపలు వాయించుట)

శారద : రానమ్మా, రా. మ్మా, అత్తా ! కొట్టకత్తా ! నేనత్తా !
శారదను ...శారదనత్తా !

(ఇంతలో జయదేవుడు స్నానాదికములొనర్చుకొని ప్రవేశించుట)

చూడండి మామయ్యా !

జయదేవుడు: పద్మా ! ఏమిటిది!...రా, అమ్మా శారదా !

పద్మావతి : (స్మితయై) ఏమీ లేదండీ !

శారద : లేకేం మామయ్యా ! మా అత్తయ్య ఈ నాడు నిజంగా యశోదా దేవి అయింది !

జయదేవుడు: అందుక నేనా చిట్టితల్లి బుగ్గలిలా మందారాలైనవి !

పద్మావతి : ఏంచేశానమ్మా ! (దగ్గరకు తీసికొని) శారదా ! (చూచి) అయ్యో నాచేతులు ! (గద్గదంగా) బుగ్గలు పిండేనా తల్లీ! అమ్మో ! వ్రేళ్లలా తేలాయి ! ..నన్ను మన్నించవు తల్లీ

శారద : నీవేంచేశానత్తా ! నీ తన్మయంలో నన్నూ భాగం పంచుకొ నిచ్చావు! ..అదృష్టం అత్తా !

పద్మావతి : (గుండెకు హత్తుకొని మూర్ధాఘ్రాణంచేయుట)

జయదేవుడు: యశోదా కృష్ణులు మీరిద్దరు ధన్యులు శారదా! ఆరగింప జేసినా ఆగ్రహించికొట్టినా అమ్మకే కలదమ్మా హక్కు!

పద్మావతి: ఏమనుకోకు తల్లీ!

శారద: నాకు తల్లిలేని లోటు తీర్చావమ్మా అత్తా!

జయదేవుడు: కూర్మిగల తల్లికొట్టినా నెట్టినా-ఆకోపతాపాల్లోను సంతా నాన్ని గుర్తించిన కోర్కెలే గుబాళించుతయ్!

శారద: ఆమాట నిజం మామయ్యా! (పద్మావతి దెస నవ్వుచు) యశోదమ్మ ఏం జేసిందో చూచారా, ఇవ్వేళ! తిన్నంత వెన్నపెట్టి .....

పద్మావతి: తిన్నన్ని దెబ్బలు కొట్టింది, ఔనా!

శారద: కాదత్తా, కాదు - అవి వెన్నప్పాలు!

జయదేవుడు: ఆ మాట అనకమ్మా!...మర్యాద తెలిసినది మీ అత్త!

పద్మావతి: చాల్లెండీ చమత్కారం! మరీ వడ్డిస్తానను కొన్నారా!

జయదేవుడు: నీవుమాత్రిం తెలియనిదానవా! పారవశ్యంలో బాల కృష్ణుడని పది వడ్డించావు!...

పద్మావతి: అవునండీ! కోడల్ని ఆమాత్రిం కోడండ్రికం పెట్టకపోతే అత్త నెలా అవుతాను!

జయదేవుడు: భర్తకూ భరతం పట్టించకపోతే భార్యవూకావేమో!

శారద: నాజాగ్రిత్తలో నేనుంటానుగాని అత్తా! నిన్ను మాత్రం అలాంటి భక్తిలో అన్నప్పుడల్లా చూడాలని ఉందత్తా!

జయదేవుడు: పద్మకు భక్తికీ భేదమేమున్నది శారదా?

పద్మావతి: మీ మామ తక్కువవారా తల్లీ! సాక్షాత్తు మన్మథ జనకులు ఆ మాధవులే!

శారద. అవును మామయ్యా! నాన్నా అదే అంటారు! "అమ్మడు జయదేవులు... మామ మాత్రమే కాదమ్మా-మాధవుడేను అని... "పద్మత్తయ్య బంధువు మాత్రమే కాదు - సాక్షా రాధాదేవి" అని...

జయదేవుడు: అవునమ్మా! మా బావకు నాపైనున్న అభిమానం అలాంటిది, కాని ఒకటిమాత్రం నిజం శారదా! అత్తయ రాధ' అనటం!

పద్మావతి: అవునవును రాధ బాధ మాధవులు మీకే తెలియాలి!

జయదేవుడు: మాధుర్యం బాధ ఎలా అవుతుంది! సాధుశీల రాధ! ఆ రాధ నీయురాలు!...

పద్మావతి: కాదు. మాధవాధీన! దీన!

శారద: అవునత్తా! రాధా మాధవులు మీరిద్దరు. మీ కథలే నా అధికానందం. అందుకే విడిచిఉండలేనత్తా మీ యిద్దర్నీ

పద్మావతి: నీవే మా ప్రాణం అనుకొంటున్నామమ్మా.

జయదేవుడు: పరాశరుడు నిన్ను కన్నాడు, అంతే. నాతల్లివమ్మా నీవు. నాన్నకు నాకూ అభేదం తల్లీ, ఆ బాల్య స్నేహితు మేమిద్దఱం

పద్మావతి: ఆ కారణంగానే నాకు అన్న అయినారమ్మా, నాన్న. మామయ్య మాధవులైతే మీ నాన్న ఉద్ధవుడే!

శారద: సంతోషం పట్టలేకున్నాను మామయ్య. ఏదీ మీరు రో వినిపించే బాలకృష్ణుని లీలా వినోదం.

జయదేవుడు: అవునమ్మా, విను. వేళగాని వేళ అమ్మను పాలీయమ ఎలా వేధించేవాడో చూడు:-

శా॥ "పాలుం ద్రావుము, పాత్రయీ వెజననీ!" "పాలిప్పు లేవేకదా."
"ఏలే లేవు?" యదూద్వహా! కలుగఁబో! రేద్దైన, నెట్లుండురే?
ఆలుంజేపెడు వేళ కాళ్ళిమ తగన్ వ్యాపించు నద్రిక్కులన్
వాలుంగన్నులు మూయనట్లుగఁగదే పాలీయవే, అమ్మరో!

ఒకనాఁడొక గోపిక యింటికేగిన ఆయమ్మ వానితో

శా॥ లేరే యెవ్వరటంచుఁ జొచ్చితివె యిల్లీవేళ! మాయిల్లు! కా
దే రాజీవదళాక్షి; మాయిలెరుమా! దివ్యంబునీకూతలో
రోరీ, యెవ్వఁడవోరిదొంగ! కనవేమో, రాముతమ్మున్ ననున్
పేరుంగొప్ప గుణంబుపేద! నిజమే! పెంపెక్కఁబో కీర్తియున్

శా॥ అందేమున్నది వస్త్రిలాడ! వెదుకన్ ఆయాస ముంజెందె ద
గ్ధాంగం దూపాల కలామనోజ్ఞ! తరుణీ! ఈ రేయి మాదూడ తా
నెందో యేగెను, కానరాదకట; ఇఁదేమేని నిద్రించునో!
అందా! వెన్నపనంటిలోనన! బళా! ఆఁబెయ్యనిద్రిం చెదున్

శారద : విన్నావా అత్తయ్యా! అన్నీ కొంటె వేషాలే! ఎవరు నేర్పారమ్మా చిన్ని కృష్ణయ్యకు ఈ నటించటం!

ఁయదేవుఁడు: రాధ బోధన కావచ్చు నమ్మా!

శారద : అవునా అత్తా!

పద్మావతి : కాదమ్మా! రాధికముగ్ధ! అమాయిక! కొంటె కృష్ణుఁడే కోరిక లూరించినాఁడమ్మా, ఆమె ముగ్ధహృదయంలో!... వానిమోహన వేణుస్వనానికి ఆమె ప్రేమైక హృదయం స్పందించింది... ఔను కానీ అండి!... నేఁడొకటీయని వింత చెబుతామన్నారు!

శారద : నేను వినవచ్చునా మామయ్యా!

యదేవుఁడు : అవశ్యం వినవలసినదే! పద్మా! నీసహాయం అర్థిస్తున్నాను... నీవుఔనంటే ...

పద్మావతి : చూచావా, శారద ! ఎలామాట్లాడుతారో మామయ్య !
ఇంకానయం, ప్రార్థించలేదు ! అదేమో శాసించండి !

శారద : అత్తయ్యా మీమాట కాదన్నదెప్పుడు, చెప్పండీ !

జయదేవుడు : నామాట జవదాటని జవరాలవు; నాపాటకు నీ ఆట
తోడ్పడాలి పద్మా !

పద్మావతి : మన ఆటపాటలు ఏనాడు లేవు !

జయదేవుడు : లేవనికాదు... కాని...

పద్మావతి : మరి... వీధికెక్కవలెనందురా !

జయదేవుడు : భార్య భరతశాస్త్ర ప్రావీణ్యం వాడవాడలా ప్రదర్శింపగో
అల్పాశయుణ్ణి కాను పద్మా!.. నా పాటలోని ప్రతిమాటకు
పటుత్వం నీనృత్యలాస్యవిన్యాసంలో ప్రతిధ్వనించాలి !
బంగారుకావ్యాలకి నీ నాట్యమే గీటురాయి ! అదే నా
లావ పద్మావతీ చరణచారణ చక్రవర్తి కావటమే నావాం
నాట్యసరస్వతివి నీ మెప్పు పొందినప్పుడే నా అష్టపదుల అదృష్ట
ఏమందువు, పద్మా !

పద్మావతి : మీరప్పగించినగొప్పతనం లేకున్నా నా కాయదృష్టం కలిగే
అని !... ఇంతకూ మీరన్నది...!

శారద : ఏమిటిమామయ్యా ! అష్టపదులా !... అంటే ఇవేవో క
విధులు లాగున్నాయే !

పద్మావతి : కాదమ్మా ! వారికివి ఇష్టనిధులే అయివుంటవి ! కాకుంటే
గంటం పట్టేవారేనా మామయ్యా !

జయదేవుడు : నిజం శారదా ! ఇవి నాయిష్టపదులే కావు ! శారదాదే
ప్రియంగూర్చే అష్టపదులు ! నాయిష్టదైవం రాధామాధవు
ఆరాధామాధవులు ...

పరాశరుడు:- (ప్రవేశం)

పద్మావతి : రండి అన్నయ్యా !

జయదేవుడు: సమయానికి వచ్చావు బావ !

శారద : నాన్న! విన్నారా! మళ్లీ మామయ్యేదో రచన తలపెట్టారు!

పరాశ : ఇంకేం! లోకానికింకొక ఆనంద తరంగం! సాహితీ వేత్తలకొక సాహిత్యమండలం! ఆలంకారికులకు ఒక అమూల్య మండనం! రసపిపాసువులకు ఒక రసతరంగిణి !

జయదేవుడు : అంతే కాదయ్యా ! మా పరాశరుని కోయిల కంఠానికి ఓ పావన గీతి! మా శారదకు ఇంకొక సంగీతం !

శారద : మా అత్తయ్య మెత్తని పాదాలకు ఇంకొక క్రొత్త సత్తువ !

జయదేవుడు : అవును బావ! ఇంతవరకూ ఇన్ని రుచులు సమకూర్చాలనే నా ప్రయత్నం !

పరాశ : ఉద్దేశ్యం కొద్దిదేలా అవుతుంది బావా ! సంకల్పించిన సముజ్జ్వల గ్రంథం !

జయదేవుడు : రాధా మాధవ విలాసం! ఆ మోహనమూర్తుల సమ్మోద విహారం ! నాజననీజనకుల సరసాలోకనాలాపన కరణాధ...

పరాశ : గ్రంథనామం !

జయదేవుడు: గీత గోవిందం.

శారద : అందంగా ఉంది పేరు మామయ్య !

పద్మావతి : ఇలాంటివే దొరుకుతాయమ్మా మామయ్యకు ఇంకేరి లేనట్టు !

పరాశ : అవునమ్మా! రాధా మాధవ శృంగారం వర్ణించాలంటే జయదేవుడొక్కడే సమర్థుడు. అన్యులకా అర్హత అలభ్యం తల్లీ! రాజాస్థాన పండితులందరు ఉద్ఘాటించిన పరమ సత్యం

సరి సరి తెచ్చినవార్త వినిపించనే లేదు !

జయదేవుడు : ఏమావార్త, బావ!

శారద : నాన్నా, నాన్నా ! ముందా పండితులే మన్నారో చెప్పరూ

పరాశ : శ్లాఘాపాత్రంగా చెప్పారమ్మా మామయ్యను గురించి రా రాజు లక్ష్మణసేనునితో !

పద్మా : (భర్త వైపు మందహాస మొలికించుటు. అతఁడా మెను జూచుచు చిఱునవ్వుల)

పరాశ: శ్లో॥ "వాచః పల్లవయ త్యుమాపతిధర స్సందర్భశుద్ధిం గిరామ్
జానీతే జయదేవ ఏవ శరణః శ్లాఘ్యోదురూహద్రుతేః
శృంగారోత్తర సత్ప్రమేయ రచనై రాచార్య గోవర్ధన
స్పర్ధీకోఽపిన విశ్రుతశ్శ్రుతిధరో ధోయీ కవిక్ష్మాపతిః."
(లక్ష్మణసేనుని ఆస్థాన మందలి కవీంద్రుల నామములు)

శారద : చక్కగా చెప్పారు నాన్న-"సందర్భ శుద్ధిం గిరాం జానీ జయదేవ ఏవ" యట ! నిక్కమైనముక్క ! మామయ్య కొక్కరికే చెల్లుతుంది !

జయదేవుడు : ఇంతకూ బావా, తెచ్చినవార్త !

పరాశ : రాజుగారిప్రక్కన పట్టాభిషేకం। ఆస్థానం అలంకరించా మీరీనాఁడు! లక్ష్మణసేనులేమో అర్థించాలనుకొన్నారట సమక్షంలో సమగ్రంగా చెబుతామన్నారు. నిరాలస్యంగా..

జయదేవుడు : బయలుదేరుతున్నాను బావ! మీరూ నావెంటనే...

పరాశ : నమ్మిన బంటునుగదా! వస్తాను !

పద్మావతి : ( శారదతో ) బావా మఱఁదుల పరిహాసా లమ్మాయివి వేళయిందేమో అన్నయ్యా !

పరాశ : ఆఁ, ఆఁ! కావచ్చిందమ్మా !

జయదేవుడు : వచ్చేస్తున్నాను బావ! నాస్వామి-గోపస్వామికో మొక్కు అంతే ! ఏదమ్మా, శారదా !

శారద : నిన్న నేర్పిందేనా !

పద్మావతి : అవునమ్మా, కొంగొత్తలు గాని స్వామికి రుచింపవు ! ఏదీ అను!

శారద : నీవూ అనత్తయ్యా !

పాట

సమస్సుమంచిదే - కొను - హారేహరే
మనస్సుమంచిదే - కొను - హారేహరే
శుభంబొసగుమో శోభనమూర్తి
సుఖంబొసగుమో సూనృతకీర్తి
వరాలొసంగెదె పరాకుసేయక
మొరాలకింతువె మురాసురాంతక
దయాంతరంగా మదంతరాత్మా
భయార్తిభంగా భవాంతరాత్మా ॥

పద్మావతి : (సభాయోగ్యమైన దుస్తులిచ్చుట)

జయదే : (స్వీకరించి, ధరించి, స్వామికినమస్కరించి)
వెళ్లొస్తానుశారదా ! (పద్మవైపునవ్వుట)
పదండిబావ ! (పద్మ, శారదలు వీడ్కొలుపుట.)

—o—

# రెండవ రంగము

మహారాజు లక్ష్మణసేనుని ఆస్థానము
సింహాసనస్థుడగు రాజు, ఉచితాసనములపై
పండితులు:—జయదేవుని రాకకై నిరీక్షణము.
వాని ఆగమనము
నర్తకిచే నృత్య పూర్వక సత్కారము.

---

"కవి వల్లభ! జన వల్లభ
గౌరవ సుమపూజా సత్కారం
చేతః ప్రీతము-చేకొనుమిదె సత్కారం
ఘనమిది దుర్లభమిది-కవిరాజేశ్వర
గైకొనుమయ్యా-కాదనకయ్యా ॥
పదములు కడిగి పావలుతొడిగి
పట్టుదుకూలం పరిమళవీడెం
చుట్టమవంచు-చే-బట్టెదవంచు
గంటముగి దే-కానుకటంచు
జనవల్లభుడిదె-చనవిచ్చెను, మెచ్చెను
కనవచ్చును-కావ్యేందిరనిక, వినవచ్చును జగమెల్ల"

లక్ష్మణసే: (ఆసనముదిగ్గి యెదురువచ్చును) శ్రీ జయదేవ కవి సార్వభౌములకు
ఇవే ప్రణామ సహస్రములు.

జయదేవుడు: (చేయెత్తి ఆశీర్వదించుట) వంగావనీశ్వరప్రభూ!
జయోస్తు, విజయోస్తు! అభ్యుదయమస్తు!

గోవర్ధనుడు: రతిమంజరీ చంద్రలోక కృతికర్తలకు ఇవే రసకవి రాజో
చిత గాఢాలింగన సపర్యలు!

జయదేవుడు: శృంగారోత్తర సత్ప్రమేయ రచనైక దక్షులు! ఆచార్య
గోవర్ధనులు! అహో, మహాద్భాగ్యము! వినమిత మూర్ధుండను

ోయి : తత్త్వ చింతామణీ పరతత్త్వవేదీ, నమోస్తు !

య దేవుఁడు : కవిక్ష్మాపతులు. ధోయీ కవీంద్రులు! నమోవాకమిదె!

క్ష్మణ: సుహృద్వర్యులు, పరాశరులు! ఇదో ఉచితాసన సంభావనం

రాశ : అనుగృహీతుఁడను ! (యథోచితాసనములపై అందఱుకూర్చుందురు.)

క్ష్మణ : మా కోర్కెలు మీభక్తి ధ్యానములకు అంతరాయ మాపాదించిన వేమో !

య దేవుఁడు : ఆత్మబంధువుల ఆదరాహ్వానం, అంతరాయమా ప్రభూ!...అమితానంద సంధాయకం !

క్ష్మణ : రాజాదేశమని రాకున్నచో......

య దేవుఁడు: అధికార దుర్గర్వం అవివేక లక్షణం! మా లక్ష్మణసేనులు అట్టి వారెన్నఁడు కారన్న నమ్మిక మాకున్నది !

ర్ధ : ఆబాల గోపాలమెఱింగినది ప్రభువులఆదరణ !

క్ష్మణ : ధన్యుఁడను ! కాని విజ్ఞానధనులైన మీమైత్రిచే నేర్చిన వెన్నియున్నను...

ోయి : లేని ఐశ్వర్యమేమున్నది మహారాజా !

క్ష్మణ : అట్టిసైశ్వర్యములున్నను అపదలందు ఆదుకొనఁగలవా మహా కవీ ! (అందఱు నిర్వణ్ణులగుదురు)

ర్ధను : ఆపదలా ప్రభూ ! మీ యేలుబడిలో ఆపదలకేగదా ఆపదలు !

క్ష్మణ : (సంతోషముతో) కావచ్చును. కాని అది బాహ్యవిషయం. ఆత్మ భయం అతిబాధాకరమైనది !

య దేవుఁడు : ధైర్యహిమాద్రులు, తమకా భయం !

క్ష్మణ : అందుల కే తమను ఆహ్వానించినది !

జయదేవుఁడు : అతిసామాన్యుఁడను ! నేనా తమకు అభయప్రదాతను !

లక్ష్మణ : అమరకవిశాసనాధులు! జయదేవులీనాఁడు అభయప్రదాత

జయదేవుఁడు: అద్భుత ప్రసంగమిది మహారాజా !

లక్ష్మణ : ఎఱుకచే కలిగిన భయమిది!

జయదేవుఁడు: అట్లయినచో అది ముందు గతికి పుణ్య సోపానమే! భవభయమా ప్రభూ, తమ బాధ !

లక్ష్మణ: పరేంగితజ్ఞులు, భక్తవర్యులు ! పసి కట్టితిరి ! "రాజ్యా నరకం ధ్రువం" అనికదా ఆర్యోక్తి! రాజైన నాకు అ మెట్లు దాటవచ్చును !

జయదేవుఁడు: వివేకవంతులు ప్రభూ! మీకా భయమెందులకు !

లక్ష్మణ : ఇట్లనుట ఊరడింపు కవిరాజా! ఇప్పట్టున కావలసినది వా ప్రబోధము. అది మీ కావ్యాత్మనుండియే ప్రసరింప వ

జయదేవుఁడు: నూతన అవిష్కరణము! కావ్యమొనరింపుమని ఆజ్ఞాపిం మీ నేర్పు!......

లక్ష్మణ : ఆజ్ఞాపనమా ! కాదు, జయదేవకవీ ! ఇది నా విజ్ఞాపన ముక్తి ప్రదమైన విష్ణు కధాలాపన మొనరింప చున్నాను.

పరాశ : ఇది దైవోద్దిష్టము కాబోలు ! కొల్వఁబోయిన గోవిందు రైనాఁడు ప్రభూ !

లక్ష్మణ : నాయదృష్టము అనల్పమనుకొందును ! నాభయోచ్చాట నకు భద్రమార్గమేర్పడినదా, పరమబంధూ !

పరాశ : మానవులకే పాపభయం తీరనున్నది మహారాజా ! మా జయదేవులీనాఁడే గీత గోవిందరచన మారంభింపఁబూనిన

గోవర్ధను : శుభస్యశీఘ్రం ! మహాశయా, ఇదెనా ప్రోత్సాహం!

స్నేహి : కవి గంటము, కరికరాగ్రము కదలకుండుటెట్లు! కానిండు! కమనీయ కావ్యావతరణమునకు ఇదే శుభముహూర్తము !

లక్ష్మణ : గీత గోవిందమందలి కథావస్తూద్దేశ్యములు వినవచ్చునా, కవిరాయా !

జయదేవుఁడు : ముక్తి కాంక్షులకు మున్గొంగు బంగారమైన రాధా మాధవ శృంగారమే లక్ష్యమైనది-భావించి పరవశులగుటకు! అందుచేతనే మంగళాశాసనముగ ఇట్లారంభింప నెంచు చుంటిని !

లక్ష్మణ : ఎట్లు! మా మందిరమెంత పుణ్యము చేసికొన్నది! ఆరంభమిందే యొనర్చు చున్నారు! ధన్యుఁడను.

జయదేవుఁడు: మీ మందిరమొకటి నా మందిర మొకటియునా! ప్రారంభమిందైనచో నిర్వహణము అందగునుగదా !

లక్ష్మణ : సంతోషము! ఎట్లారంభింతురు!

జయదేవుఁడు: కవి మిత్రులు అనుజ్ఞాపింతురా !

గోవర్ధను: అభ్యర్థించవలెనా మహాత్మా! మీ సహాకవులమైనామన్న మన్నన పొందిన చాలును! కానిండు!

జయదేవుఁడు : పరాశరా ! ...ప్రభూ ! ఇట్లన్నచో బాగుండునేమో !

శ్లో॥ "మేఘైర్మేదుర మంబరం, వనభువశ్శ్యామాస్తమాలద్రుమైః
నక్తం భీరురయం త్వమేవ తదిమం రాధే గృహంప్రాపయ!
ఇత్థం నందనిదేశ తశ్చలితయోః ప్రత్యధ్వకుంజద్రుమం
రాధా మాధవయోర్జయంతి యమునా కూలేరహః కేళయః"

లక్ష్మణ : అమృతమేయిది! అమరకవీ, ఏదీ మరొక్క మారు ! ...

జయదేవుఁడు : (మరలచదువుట)

శ్లోయి : "నంద నిదేశము" కుమార కృష్ణుని ఇంటఁజేర్పుమని నందు ఆదేశించెనట రాధను! ఎట్టి సదవకాశమును కల్పించినార ఇక రాధా కృష్ణులకు నిర్భయానందప్రాప్తి! అహో !....

గోవర్ధను: అందుచేతనే కాబోలు "ప్రత్యధ్వకుంజద్రుమం—రాధామాధ యోర్జయంతి యమునా కూలే రహః కేళయః" అన్నా వీరి కేళీ వినోదాలకు ఆట పట్టులైన ఆ పొదరిండ్లు, ఆఛాయ తరువులు ఎంత పుణ్యం ఆర్జించినవో! ఆ రాధా మాధవు ఎల్ల వేళల శుభ ప్రదాతయా గాక !

లక్ష్మణ : తండ్రి హృదయం ఎలా తత్తర పడింది! "మేఘైర్మేద మంబరం, వనభువశ్శ్యామాః తమాలద్రుమైః, నక్తమ్ ఇవన్నీ వెన్నదొంగకు భయోత్పన్న కారణములు! నక చర ధ్వంసికి చీకటి రాత్రులన్న వో ఎక్కడలేని భయమట మేను శ్యామునకు మేఘములు ఒక్కచో చేరినందున గుం జారునట! పాపము, సహజ భీరుఁడట అట్టి వేళలందు వాత్సల్యాతిశయం వాస్తవాన్ని మఱపించి వెరపు కలిగించట అత్యంత సహజమేకదా! కవీంద్ర చంద్రా! ముందు ముందె మహత్తర రసప్రవాహములు ముంచెత్తనున్నవో!...

జయదేవుఁడు: ప్రభువుల ఆనందం, మిత్రుల ప్రోత్సాహములున్నచో ఇంకే కావలయును! నా యీ ప్రయత్నమిట్లే నిరాఘాటముగ నిః మాధురీ మహిమతో సాగిపోగలదని ఆశ!

లక్ష్మణ: మాయధీనమందున్న సర్వ సంభారములు తమ వశంచేయగల అక్కఱగలవన్నీ ఆయత్తం చేయఁబడును! ఆ మహనీం కావ్య నిర్మాణం మామందిరంలోనే...

జయదేవుఁడు : మన్నించండి ప్రభూ ! మా గృహమందున్నను ఏకోఱంత్రయ నుండదు, మీ అభిమానమునకు దూరస్థామీప్యములా !

ధోయి : మహారాజులకో ఱెక్కె చెల్లింపవచ్చునే కవిరాజా !
గోవర్ధను : ఇందున్నదో సాధన సంపత్తికి లోపమే ఉండదనుకొందును !
లక్ష్మణ: ఏమందురు !
జయదేవుడు: అనుటకేమున్నది! అన్యథా భావింపకుందురేని మనివి! మా యింట నైనవో నాకావశ్యకమగు సాధన సంపత్తి పరిపూర్ణత గాంచును. కారణ మందురా! నా ప్రతిజ్ఞా పరిశీలనమున సుగ్రాహ్యము !
శరణ : బావగారి భావమే ప్రతిభావంతము, సంభావ్యమును. ప్రభు వర్యులు ఆలకించి అనుగ్రహింతురుగాక !
జయదేవుడు మహారాజా!...సదస్యులు, ఇదెనా ప్రతిజ్ఞ !
శ్లో|| "వాగ్దేవతా చరిత చిత్రిత చిత్తసద్మా !
పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ !
శ్రీవాసుదేవ రతికేళి కథా సమేత
మేతం కరోతి జయదేవ కవిఃప్రబంధమ్||
ఇది నా సంకల్పనిష్ట.
లక్ష్మణ: ఉన్నతాశయం మహాత్మా ! అనన్య శామాన్య దుర్లభమైనది. మీ ఉత్కృష్ట సాధనం ! పుణ్య భాగ్యులు. మీరే అదృష్ట వంతులు! మా తల్లి పద్మావతీదేవి మిమ్ము లోగొన్నది; అంతె చాలు; ధన్యులము.
శరణ : ప్రభూ నేటికి సెలవిప్పింతురేని......
జయదేవుడు: ఈ ఉత్సాహముతోనే ఉపక్రమింతునుగాక !
లక్ష్మణ: సజ్జన సన్నిధినెడ బాయలేని ఛాందసము; మన్నింతురుగాక ! ఆచార్య ! కవిక్షితీశ ! నేటికి విశ్రమింతురుగాక ! జయదేవకవీ ! ప్రతిదిన సందర్శనభాగ్య మొసంగెదరు కదూ!
జయదేవుడు: ఎంతమాట ! తప్పక, సెలవు. బావ (రాజుతో) చిత్తం !
(వీడ్కోలు — నిష్క్రమము)

—o—

# మూడవ రంగము

జయదేవుని పూజా మందిరం. దేవతా మంటపము నెదుట సుఖాసనమున జయదేవుడు వానిప్రక్కను ముందును తాటియాకుల పొత్తములు — గంటము. పద్మావతీదేవి నాట్యమొనర్ప సిద్ధమగును.

[ తెర ఎత్తబడును. ]

జయదేవుడు: (ధ్యానము)

శ్లో॥ మందారమూలే మదనాభిరామం
బింబాధరా పూరితవేణునాదం
గో గోపగోపీ జనమధ్య సంస్థం
గోపం భజే గోకుల పూర్ణచంద్రం ॥

(పద్మావతి స్వామికి నమస్కరించి నిలిచియుండుట.)

(చిఱునవ్వుచు) మత్రి అందులకే రాధ వన్నది! నీ నిరాడం
ముగ్ధవేషం మురళీ మోహన సమ్మోహన యంత్రమే !

పద్మావతి: బాగున్నది. ఇల్లాలి యిఃపు భర్తకే సొంపు! మీకు నాక
అందకత్తెలున్నారనే తోచదు! మీకంటెను నాకున్న ప్ర
ధిక సంపదలేమున్నాయి చెప్పండి !

(శారద ప్రవేశించుచుండును.)

జయదేవుడు: ఈ అన్యోన్యతే అవినాభావం. అవినాభావం ద్వార
ఆనందోపాసన! స్త్రీ పురుషులు ఆత్మ పరమాత్మలు పద

పద్మావతి: రా అమ్మ శారదా !

శారద : ఔనత్తా, విన్నాను పుష్పం సౌరభం విడి విడిగా
ఉంటై! అత్త మామ లోకరే గదా !

పద్మావతి: అమ్మా నాన్నలు గానే మమేకం!

శారద : (చిన్న బుచ్చుకొనును.)

పద్మావతి: ఆ దేవిఁటమ్మా! నా తల్లిగదూ! జ్ఞాపక మొచ్చిందామ్మ అమ్మ!

శారద : (గద్గదంగా) లేదత్తా! నీవున్నావుగా! అమ్మవు అత్తవునీవే నాకు!

జయదేవుఁడు: ఔనమ్మా! నీకేమె అత్త! నాకో, నా అదృష్ట దేవీమూర్తి!

శారద : ఔను మామయ్యా! మీరు మాకిందఱకు పరమాత్మ స్వరూపులు. మీ ఎదుట ఉన్నంతసేపు చెప్పలేని ఆనందం; అన్నం నీరు అక్కఱ అనిపించవు!

జయదేవుఁడు: ఆహారం ఆకలి మాత్రమే తీరుస్తుంది కదమ్మా! మఱి మన భగవన్నామ సంకీర్తనం భవ బాధలన్నీ తీరుస్తుంది. నామ జపంవల్ల కలిగేతృప్తి, మనశ్శాంతి మఱిదేని వల్లను కలుగ దమ్మా! ప్రారంభిద్దామా, పద్మా!

పద్మావతి: ముహూర్తం మించ నీయకండి! కాల ప్రాభానం గణింపతగ్గది! కానీ అండి! కావ్యారంభం రాజ మందిరంలోనే చేసేరట, అన్నయ్యన్నారు! మీ ప్రతిజ్ఞ అని నన్నే మో అల్లరి పాలు చేసేరట... ఎందుకండీ నన్ను వీధి కెక్కించటం!... గుట్టుగ నట్టింట్లో ఉండేదాన్ని!

జయదేవుఁడు: లేదు పద్మా! అందల మెక్కించాను! నా సర్వస్వానికి సామ్రాజ్య లక్ష్మివిగా పట్టం గట్టాను! ఏమమ్మా, శారద! నా తప్పేమున్నది చెప్పు!

పద్మావతి: సంతోషం!... పైగా చిన్న పిల్ల, దానికికూడా నేర్పండి మీ కవిత్వం!

శారద: కవిత్వమేమిటత్తయ్యా! పట్టుగలభక్తి నీవు పట్టించేవు; నోరారా పాటలు పాడించేఁడు మామయ్య!

పద్మావతి: అవునండీ! మీరు చూచారోలేదో కాని శారద భక్త్యావేశం, అమ్మో, దానిది గట్టిభక్తి!

శారద: (తలవంచు కొనుట.)

జయదేవుడు: పూర్వజన్మ సుకృతమని ! జన్మతరించే మార్గం, రమ్మ వస్తుందా !

శారద: మామయ్యా, కాలంగడచి పోతున్నదేమో !

జయదేవుడు: లేదమ్మా !

పద్మావతి: అవునమ్మా, నా దేశవ్వం. ప్రారంభిస్తాంటే పలుకరించా కుమించి ... కానీయండి !

జయదేవుడు: ఆజ్ఞ అయినట్లైనా ! (అందరు నవ్వుట)

మాలవ రాగం — రూపకతాళం

1. "ప్రళయపయోధిజలే, ధృతవానసి వేదం
విహిత వహిత్ర చరిత్రమఖేదమ్ .
కేశవ ! ధృత మీనశరీర ! జయ జగదీశ ! హరే ! ధ్రువమ్.
వితరసి దిక్షురణే దిక్పతి కమనీయం
దశముఖమౌళి బలిం రమణీయం
కేశవ ! ధృత రామశరీర ! జయ జగదీశ ! హరే ! ధ్రువమ్
శ్రీ జయదేవ కవేరిద ముదిత ముదారం
శృణు శుభదం సుఖదం భవసారం
కేశవ ! ధృత దశవిధరూప ! జయ జగదీశ ! హరే !

భగవంతుడు విఘ్న విచ్ఛేదియగుగాక ! అనమ్మా ! అనగిల వేమో చూడు . (మెల్లగా) అత్తయ్య వంక చూడు ! భక్తి భావాలి ఎలా సాకారం చెందుతున్నదో ! ఓహో !

భైరవి — త్రిపుటతాళం

2. " శ్రితకమలా కుచమండల ! ధృతకుండల ! ప
కలిత లలిత వనమాల ! జయ జయ దేవ ! హరే ! ధ్రువమ్.

దినమణి మణ్డల మణ్డన ! భవ ఖణ్డన ! ఏ
మునిజన మానస హంస ! జయ జయ దేవ ! హరే
యదుకుల నలిన దినేశ ! జయ జయ దేవ ! హరే !
జనక సుతాకుచ భూషణ ! జిత దూషణ ! ఏ
సమర శమిత దశకంఠ ! జయ జయ దేవ ! హరే !
శ్రీ జయదేవ కవేరిదం కురుతే ముదం ! ఏ
మంగళ ముజ్జ్వల గీతి జయ జయ దేవహరే॥

పద్మావతి: (మధ్య మధ్య తానును పాడును.)

శారద: (ఒక్కొక్క చరణం జయదేవుడన్న తరువాత అనుమండవలెను. భక్తితో తన్మయత చెందవలెను.)

జయదేవుడు: హే శ్రియఃపతే! దీన మందార! సుందరాకారా ! బృందారక వందిత పాదారవింద! ప్రభో! కృష్ణ! రాధే కృష్ణ! రాధే కృష్ణ!

పద్మావతి: స్వామీ తన్మయత్వమా యిది !

జయదేవుడు: అనుభవం భావ వేగానికి అడ్డు తగులుతూంది పద్మా!... సరి. ఆ రాధా విరహం నన్నావేసించుతూన్నది !

పద్మావతి: పాపము, ఆమె నూరడించువారే లేరా!

శారద: మామయ్యా! కృష్ణుడంత నిర్దయుడా!...తన నంతగా ప్రేమించిన రాధను వదలి వెళ్లేడా !

జయదేవుడు: భగవంతుడు భక్తుల భక్తి బలం పరీక్షిస్తాడమ్మా !... మనస్సు మథింపబడాలి...మన్మథ మన్మథుణ్ణి మనో వీథిలో బంధించాలి! వానికై తపించాలి!

పద్మావతి: ఎంత యేడ్చినా సుంతయినా మొరాలకించేనా, స్వామీ !

శారద: అదేమిటత్తా! ఎవరికోసం తానున్నది! కావలెనన్న వారికే క[illegible] వాతాడా! మామయ్యా! చివరకు రాధకు కనుపించాడు కదూ!

జయదేవుఁడు: రాధ కృష్ణ విరహంతో పడిన బాధకంటె రాధా ప్రియో
వల్ల కృష్ణుఁడే తలక్రిందైనాఁడమ్మా!... పద్మా! ఆ ప్రణ
నీ ప్రియుల అవస్థలు అందందు వర్ణింతునుగాని...నీకు త్వా
మున్న పట్టున నీ కాళ్ల గజ్జియలు ఘల్లు మనవలె !

పద్మావతి: మీ ఫణితి నన్నాడింపకుండునా! నా పదములు తడఁబడునేవా
మీ పద విన్యాసముండు !

శారద: నా నోటికి వచ్చేనా, అని !

జయదేవుఁడు: చూడమ్మా! అది వసంతం ... రాధ చెంత కృష్ణుఁడ
డప్పుడు... అందుచే నామె విరహతాపం చెందుతూంది
కృష్ణుని వెదుకఁబోయినది ..అలసి సొలసినది. ఇంతలో నా
చెలికత్తె కృష్ణ విహారం వర్ణించి వాని చెంతకు ఏఁగుప
మన్నది. అట్లే ఆ చేటి సూటిగాఁబోయి కృష్ణునకు రాధ
దశ చెబుతుంది. తిరిగివచ్చి కృష్ణుని అవస్థ రాధ చెవిని వేస్తు
రాధను మాధవుని చెంత చేరుస్తుంది.

శారద: ఇవన్నీ అష్టపదుల్లో వరుసగా వస్తాయా మామయ్యా! ?

జయదేవుఁడు: (రచన మొనర్చుచు పాడుచుండుట — పద్మావతి సమయానుకూల అభినయ మొనర్చుటయు — అందుందు దానును పాడుట.)
కందర్ప జ్వర భ్రాంతయైన రాధ చెలితో అంటూన్నది

వసన్త రాగము — ఆదితాళము

3. లలిత లవంగలతా పరిశీలన కోమల మలయ సమీరే
మధుకర నికర కరమ్బిత కోకిల కూజిత కుంజకుటీరే,
విహరతి హరి రిహ సరసవసన్తే నృత్యతి
యువతి జనేనసమం సఖి! విరహిజనస్య దురన్తే ధ్రువమ్.

## రామక్రియా రాగం — యతితాళం

4. "చందన చర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ
కేళిచలన్మణి కుండల మండిత గండయుగస్మిత శాలీ
హరి రిహ ముగ్ధవధూనికరే-విలాసిని విలసతి కేళిపరే ధ్రువమ్.
శ్లిష్యతి కామపి చుంబతి కామపి రమయతి కామపి రామామ్
పశ్యతి సస్మిత చారుతరామపరామనుగచ్ఛతి వామామ్
హరి రిహ............కేళి పరే !

## తోడి రాగం — ఆదితాళం

5. సంచరదధర సుధామధుర ధ్వనిముఖరిత మోహన వంశమ్
చలిత దృగంచల చంచల మౌలి కపోల విలోల వతంసమ్
రాసే హరి మిహ విహిత విలాసం
స్మరతి మనో మమ కృత పరిహాసమ్, ధ్రువమ్.
జలద పటల చలదిందు వినిందక చందన బిందులలాటం
పీనపయోధర పరిసర మర్దన నిర్దయ హృదయకవాటమ్
రాసే హరి మిహ............హాసమ్.

## కన్నడ రాగము - ఏకతాళం

6. నిందతి చందన మిందు కిరణమను విందతి ఖేదమధీరమ్
వ్యాళనిలయ మిళనేనగరళ మివ కలయతి మలయ సమీరమ్
మాధవ మనసిజ విశిఖ భయాదివ భావనయా త్వయి లీనా
సా విరహే తవ దీనా............
ధ్యానలయేన పురః పరికల్ప్య భవంతమతీవ దురాప
విలపతి హసతి విషీదతి రోదితి చంచతి ముంచతి తాపమ్
సా విరహే తవ దీనా........

జయదేవుడు: రాధ మన్మధ జ్వరమును గురించి చేటి శ్రీ కృష్ణదేవునితో
అంటూన్నది:-

శ్లో॥ స్మరాతురాం దైవతవైద్య హృద్య
త్వదంగ సంగామృత మాత్ర సాధ్యామ్
విముక్తబాధాం కురుషేనరాధాం
ఉపేంద్ర ! వజ్రాదధిక దారుణో౽సి.

పంతు వరాళి రాగము - రూపక తాళము

7. "వసతి విపిన వితానే త్యజతి లలితధామ
లుఠతి ధరణి శయనే బహువిలపతి తవనామ
తవ విరహే వనమాలీ
సఖి ! సీదతి, రాధే!"

ఘూర్జరీ రాగము - ఏక తాళము

8. "ధీర సమీరే యమునా తీరే వసతివనే వనమాలీ
గోపీ పీన పయోధర మర్దన చంచల కరయుగశాలీ
విగళిత వసనం పరిహృతరసనం ఘటయ జఘ మపిధానం
కిసలయశయనే పంకజనయనే! నిధిమివహర్షనిదానమ్
ధీర సమీరే ..కరయుగశాలీ॥

శంకరాభరణరాగం — రూపకతాళము.

9. "పశ్యతి దిశిదిశి రహసి భవంతం
త్వద ధర మధురమధూని పిబంతమ్
నాథ ! హరే! జగన్నాథ ! హరే !
సీదతి రాధా వాసగృహే. ధ్రువమ్.

## దేశవరాళి రాగం – మధ్య మాది తాళము

10. "స్మర గరళ ఖండనం మమ శిరసి మండనం
ధేహి పద పల్లవ ముదారం"

(ముందుభావం తట్టనట్లు ఆపివేసే మజిల అనుట)

ఇప్పటి వరకు అనర్గళంగా ప్రవహించిన భావం ఇట్లే ఆగిపోయినది! పద్మా! ఇప్పుడే అలావెళ్లి ఆరు బయట ఆలోచిస్తాను...

పద్మావతి : చల్లగాలికలా వెళ్లిరండి, కొంతమనస్సుకు విశ్రాంతిగా!

(జయదేవుని నిష్క్రమణము)

శారద : ఒకమారు ఇంటికి వెళ్లొస్తానత్తా! నాన్న కేంకావాలో ఏమో!

పద్మావతి : వెళ్లిరా అమ్మా! నేను విశ్రమిస్తాను.

(కొంగు పఱచుకొని చాపపై పరుండుట)

(వెంటనే శ్రీ కృష్ణదేవుడు జయదేవుని రూపంలో ప్రవేశం)

కొత్త జయదేవుడు : పద్మావతీ! ఏదీ నారచన ...

పద్మావతి : అప్పుడే వచ్చారు! రసవత్తర భావం తట్టిందా స్వామీ!

(పుస్తకం ఇస్తూ) ఇదిగో!

కొత్త జయదేవుడు: ఆ గంట మిలాతే :

"జ్వలతి మయ దారుణో మదన కదనానలో
హరతు తదుపాహిత వికారం
ప్రియే చారు శీలే, ప్రియే చారు శీలే ॥

(ముగించి తత్తరంతో పోబోవు ప్రయత్నం.) ఇదిలా ఉంచు. పని ఉన్నది! క్షణంలో వస్తాను! (నిష్క్రమించును.)

పద్మావతి: ఇంత తొందరపాటు, ఎన్నడులేదే!

జయదేవుడు: (ప్రవేశించి) పద్మా, పద్మా! ఆ గంటం ఇలా అందుకో! కమ్మని భావం! ఆ పుస్తకం!

"జ్వలతి మయదారుణో మదన కదనానలో"

పద్మావతి: ఏం విడ్డూరమండీ! ఇప్పుడేకదా వ్రాసివెళ్లారు, క్షణంలో వస్తానంటూ!

జయదేవుఁడు: నేనా! ఎవరు పద్మా! నేనా వ్రాసి వెళ్లాను! (పుస్తకం విప్పిచూస్తూ)... ఆశ్చర్యం! నే ననుకొన్న దే యిది! ఎవరు వ్రాశారు పద్మా! ఎవరు వ్రాశారిది!

పద్మావతి: మీరే కదండీ!

జయదేవుఁడు: ఓసి పిచ్చిదానా! సరిగ్గా చూచావా! నే నిప్పుడేగదా రావటం!

పద్మావతి: ఇదేమి మాయో నాకు తెలియదండి! మూడు మూర్తు మిమ్మల్నే చూచేను!

జయదేవుఁడు: ఆహా! ఎంత ధన్యవే పద్మా, నీవు! నా తండ్రి యశో కిశోరుఁడు నిన్ను కరుణించాఁడే పద్మా! నీకు నారూపం ప్రత్యక్షమైనాఁడే గోపాలుఁడు!

శారద: (పరుగున ప్రవేశించును.) ఏమిటి మామయ్యా!

జయదేవుఁడు: శారదా! మీ అత్తయ్య భాగ్యం పండింది శారదా! సాక్షాత్తు పరమేశ్వర సాక్షాత్కారం పొందింది! (చేతులుజోడి నే నంటే కోపించావే! నీవు నా అదృష్టదేవతవే పద్మా!

పద్మావతి: గోపాలకృష్ణా! ఇలా కికరించావా, నా తండ్రీ! నీ దివ్యదర్ కాంక్షించానే!

పరాశ: (ప్రవేశము)

శారద: నాన్న! నాన్న! అత్తయ్యకు కృష్ణపరమాత్మ ప్రత్యక్ష నాఁడు నాన్నా! మామయ్య రూపంలో వచ్చాఁడు నాన్న!

జయదేవుఁడు: ఎంత పక్షపాతంరా తండ్రీ! బావా! రాధాకృష్ణుఁడు పద్మ పక్షమే వహించాఁడు! నా వంకనైనా చూడలేదం

మీ చెల్లితో మాట్లాడేఁడు కూడా, నే నేంలోపం చేశాను!
....కృష్ణా! గోవింద కృష్ణా! గోపాల కృష్ణా! ( పడిపోవును. )

పరాశ: మేమందఱం పునీతులమైనాం తల్లీ, నీ సమక్షంలో! (అంజలి)

పద్మావతి: అదేమిటన్నయ్యా!... (జ. తో) లేవండి! ఈ నాఁడు కాకుంటే
ఠేపైనా కనుపించఁడా స్వామి!...... అందఱం ధన్యులం!
శారదా, అమ్మా! మామయ్యకు సంతోషంగా పాడమ్మా!

శారద : ( పాడుట ) "నమస్సుమంవి దె కొను...హరే హరే"

జయదేవుడు: (నమస్కరించుచు లేచి తానును పాడుట.)

( తెర జారును )

# నాల్గవ రంగము

( మహారాణి వినయరక్షిత ఏకాంతంగా )

**వినయ :** ఔనా ! ... నమ్మగల విషయమేనా యిది ! కలికాలంలోనా కవిగంటం కదలలేదని కంజాక్షుడు ప్రత్యక్షం కావటం ! తీవ్ర తపశ్చర్యలకే దిగిరాని దైవం మాటతో మందిర ప్రవేశమా! ఇంతకంటెను స్వీయప్రభావం వ్యాపింపజేసే తంత్రం ఇంకేమున్నది ! పరాత్పరుడు ప్రత్యక్షమైనాడంటే బ్రహ్మరథం పట్టుతుందిగదా సామాన్య జనం తనకు ! భక్తి విషయమెలా ఉన్నా, భుక్తి గడిచేమార్గం కనుగొన్నారు జయదేవ దంపతులు!

**లక్ష్మణ:** (ప్రవేశము.) ధన్యురాలవు, వినయా! ఆ జయదేవ పుణ్య దంపతుల సంస్మరణంవల్ల మనస్సుకే తేజస్సు !

**వినయ :** ఈ స్మరణ ఎలాగున్నా, నిరంతర స్తుతి పాఠాలు విన్నమూలంగా మరణమే దాపురించినంత బాధ !

**లక్ష్మణ:** ఏమిది, వినయా ! వినరాని మాటలు విన్నాము ! మాన్య జన దూషణమా ! మహాత్ముల పవిత్ర చరిత్రమును గూర్చియేనా సంశయం !

**వినయ :** ప్రభూ ! తమ చెవులకివి భూషణములైన వేమో ! కాని, నా కిట్టివి విన్నప్పుడొడలు మండును! అసంభవములు సంభావ్యములా ప్రభూ !

**లక్ష్మణ:** ఘటనాఘటన సమర్థులు భగవద్భక్తులు! వారాడిన మాటలో నటింప వలసినదే నటరాజు జగన్నాథుడు !

**వినయ :** వాని ఆట లెటులున్నా, వీరి బూటకమే అజ్ఞాన ప్రజానీకానికి ఒక నాటకం! అందు ఈ పాత్రలే వారికి చిత్రంగాతోచి ముగ్ధుల్ని చేసి మోసగించుతున్నాయి ప్రభూ !

లక్ష్మణ: పొరబడు తున్నావు వినయా !

వినయ - తమ వినయరక్షిత ఏనాడు పొరబడ్డది ప్రభూ! విద్యా విశారదులైన తమ అర్థాంగికా స్వార్థాలోచనము!

లక్ష్మణ: స్థాన భేదంవల్ల విద్య అవిద్యగా భాసించుతుంది వినయా ! ఊసరక్షేత్రంలోనా మనోహర పుష్పోద్యానముద్భవించటం !

వినయ: తమ బోధక్షేత్రంలో పసనైన మెదడున్న దనుకొందును నాథా.

లక్ష్మణ: మెదడు వేరు, బుద్ధి వేరు, వినయా! దుర్మేధస్సు బుస్సుమను విష సర్పం! అది కాటువేసినా లోకమంతయు చీకటిగా తోచును!

వినయ : మీ మనోహర మనస్సే విషయంగా తోచిందీనాడు మీకు ! ఇన్నాళ్లు అమృతధార లాలికంచిన నా హృదయభాండం నేడు సహ్యా గరళ కషాయం కల్పిస్తూందా ప్రభూ ! కారణం !

లక్ష్మణ: కాల ప్రభావమో, కర్మ కారణమో !

వినయ : కర్మ మర్మమేమో! అది ఒకటీ అనలేదు !

లక్ష్మణ: కాదని యెట్లందును, వినయా! వినయరక్షిత నేడు అవినయ వంతురాలు! ఆ కారణముగనే పూజ్య తిరస్కారమునకు ఒడి గట్టుమన్నది! మఱి ఏ ప్రభావమూ కాకున్న ఇంకేమి కారణము!

వినయ : వివేక మొక్కటి ఎక్కువ కాకూడదా ప్రభూ !

లక్ష్మణ: ఎవరికన్న ! మహాత్ముల యదృష్టమును మన్నించిన మమ్మును అవివేకులందువా, వినయా !

వినయ : లేదు ప్రభూ ! విషయము చర్చలో విశదీకరించిన విన్నపమిది మన్నింప ప్రార్థన ! నా దైవాన్ని నే నగౌరవింతునా స్వామీ!

లక్ష్మణ: కావచ్చును. విషయము వివరణమునకును విధానమున్నది. పెద్ద పిన్నల తారతమ్యము గమనింప వలదా !

వినయ : అట్లని నేనంటినా ప్రభూ! మీ రనుగ్రహించితిరి; అంతేచాలు. కాని ప్రభూ ! మన్నింప కోరుచున్నాను. నాకీ పద్మావతీ జయదేవుల భక్తిగాథలు విపరీతంగా ఉన్నాయి! వీలున్నచో ...

లక్ష్మణ : వీలున్నచో పరీక్షింతువా! వినయా !

వినయ : అవసరమన్ననూ అవకాశము రావలెనుకదా ! కానీఅండి ప్రభూ ! ఆపద్మావతికి ...

శారద : (ప్రవేశము) క్షమించాలి ! రాకూడదేమో !

లక్ష్మణ : రానేవచ్చేవు కదమ్మా ! చూచావా, వినయా ! అప్పుడప్పుడు అంతఃపురాన్ని అలంకరించే ఈ అందాలబాల యేడోలలూగం బోయినదో యిన్నాళ్లు !

వినయ : ఏమమ్మా ! నాయనగారు చెప్పనేలేదా ! చాలరోజులైనది శారదను చూచి, ఒకమారు రమ్మని చెప్పడంటినే

శారద : చనవున్నదని చంకకెక్కవచ్చునా, మహారాణీ ! ప్రభూ ! మీరన్నది ఉన్నమాట ! భక్తిడోలల్లో ఉయ్యేల లూగుతున్నాను !

వినయ : ఊగుతున్నావా భక్తిలో శారదా ! ఈ పిచ్చి నేర్పిన వారెవరమ్మా ! ... పసిపాపవు ... రసహీనంగా ఎలా మసలుతున్నావ్ !

శారద : భక్తికి వయస్సు బంధం మహారాజా ! బాలభక్తులు తరించినవారెందరులేరు ! ప్రహ్లాదుడు బాలుడేనా ! ధృవుడుపసందే కదా ! ఉద్ధవుడు వృద్ధుడా మహారాణీ! విన్నారా ప్రభూ ! రసహీనమట భక్తి భక్తకంటె పాలసముద్రమున్నదా!

లక్ష్మణ: విన్నావా, వినయా !

వినయ : పట్టించిన పాశం ప్రభూ! బాల హృదయంగదా ! చిన్ననాటి అచ్చు మచ్చ తునకవలె శాశ్వతంగా ఉండిపోతుంది; ఇదే నా భయం !

శారద: అభయ ప్రదాత! ఆ బృందావన నంద గోపాలుడున్నాడు, మహారాణీ!

వినయ: ఆ గొల్లపిల్లవాని కనుగ్రహం రావాలంటే నీవూ గొల్లపిల్లవే కావాలమ్మా!......ఎక్కడి మాటలు తల్లీ! మేమందరం భక్తులంగాము!

శారద: ఔను, ఆ గోపికా భక్తి అభ్యసించుతున్నాను!

లక్ష్మణ: అదృష్టవంతురాలవమ్మా! నిన్నుగన్న పరాశర పండితుల భాగ్యం పండిందమ్మా! వినయా! రేపీ వేళకు మన రాజప్రాసాదం పవిత్రం కావాలి! పూజ్యశ్రీ జయదేవులు సతీ సహితులై మన ఆహ్వానం మన్నింతురు గాక!

శారద: మామయ్యను ఆహ్వానించారా మహారాజులు!

లక్ష్మణ: లేదమ్మా! ముందుగా రాయబారమంపుతున్నాము!

శారద: ఆ కార్యభారం ఎవరిపైన వేశారో కాని ప్రభూ! అపజయంవల్ల ఆశాభంగ మౌతుందేమో!

వినయ: రాజాజ్ఞనే ధిక్కరింపగల వారుంటారా!

శారద: ఆశలు త్రెంచిన భక్తమహాశయులమ్మా, ఆ పుణ్యదంపతులు!

లక్ష్మణ: అవును తల్లీ! రాజాజ్ఞలు, రత్నరాసులు వారి నాకర్షింపవు! స్నేహబాంధవ్యమొక్కటే సన్నిహితం చేస్తుంది! మా అమ్మవు కదూ! నా పక్షాన నీవే బతిమాలవలె పద్మావతీదేవిని మా యిల్లు పావన మొనరింపుమని!

శారద: అవును. మా యత్త నా మాట కాదనదు! మరి మామయ్య!

లక్ష్మణ: మే మీనాడు నీ వెంట నేవచ్చి స్వయముగా వారిని అర్థింతుము. వారుభయులు......

శారద: కాదనరు ప్రభూ! సెలవు!....మహారాణీ! అరుంధతి వంటిది మా అత్తయ్య! ఎలా ఆదరిస్తారో!

వినయ : (బిరుసుగా) తగినట్లుగానే!...

లక్ష్మణ: చూచేవా వినయా! శారదకా దంపతులపైఁగల భక్తి!... అవునమ్మా! ఉచితోచితంగా సేవిస్తాము!

శారద : ఇది మీ ఘనత! ఆ ఘనశ్యాముఁడే గంటంపట్టి కవిత పూరించాఁడు మామయ్యవ్రాసే గీత గోవిందంలో! పరమాత్మ సాక్షాత్కరించిన పరమ పావనుఁడా మహాత్ముఁడు!

లక్ష్మణ: అట్టి పరమ భాగవతోత్తములు గనుకనే మహాభాగ్యంగా భావించుతున్నామమ్మా వారి స్నేహాన్ని! శారదా! మేమూ నీ వెంటనే వస్తున్నాం!

శారద : దయచేయండి! అనుజ్ఞా అమ్మా!

వినయ : వెళ్ళిరా, శారదా! (శారద నిష్క్రమించును.) ........ మీరు స్వయంగా వెళ్లటం బాగుండదేమో! పాలకులు పాలితుని చూడబోవటం!

లక్ష్మణ: రాజ గౌరవానికి లోపం! అంతేకదూ!

వినయ: కాదా ప్రభూ! సామాన్యులకు సార్వభౌములకు అంతరముండవలదా!.... మహీధవులు మీరు! మనుష్య మాత్రుఁడాతఁడు!

లక్ష్మణ : అజ్ఞాన జన్యం వినయా, నీ అభిప్రాయం!...ఐశ్వర్యాధికారం అశాశ్వతం సుమీ! భాగవతారాధనమే భగవదారాధనము! భక్తునకు భగవంతునకు భేదమెకఁడ! భక్తుల పాద ధూళియే పతిత జనోద్ధారకం!...వారిప్పుడే మన ఆలయ మలంకరింతురు దేవిపద్మావతినెట్లు సత్కరింతువో...! (నిష్క్రమణము)

వినయ : న్మా! మహారాజు సైతము ఎట్టి మాయలో పడినారు!

శా॥ దేవుండంచును దేవియంచును మహీదేవుల్ ప్రబోధింపరే!
పూవున్ పత్రియు నిచ్చి కొల్తుమనగే పుణ్యాశతో మూర్తులన్

పోపుండంచును సాటి మానవులనా! పూజించుటల్ మూర్ఖులై
చావుంబుట్టుకఁగల్గు మర్త్యుఁడగునా! సాక్షాత్తు దైవంబిలన్

మ|| అయినంగాంతుము, చూతుమీ పుడమి దయ్యంబెట్టిదైవంబొ! వీ
లయినన్ కన్నులువిప్పి భూవిభునకీ యన్యాయ్యమే చూపుదుర్
లయమో లాభము పొందఁగావలయు నిర్దాక్షిణ్య దీక్షావిధిన్
జయదేవుంజయ వెట్టు లోకమిపుడీ చందానమే ల్కాంచెదున్||

( తెర జారును. )

——0——

# ఐదవ రంగము

-: జయదేవుని యిల్లు :-

జయదేవుఁడు! (నామ సంకీర్తనము చేయుచుండును.) హారే కృష్ణా! హారే కృష్ణా
కృష్ణ కృష్ణా హారే హారే!......హారె కృష్ణా...కృష్ణ కృష్ణా!
హారె హారే! నాన్నా! నంద నందనా!

శ్లో॥ బాలాయ నీలవపుషే నవకింకిణీక
జాలాభిరామ జఘనాయ! దిగంబరాయ!
శార్దూల దివ్యనఖభూషణ భూషితాయ!
నందాత్మజాయ నవనీత ముషే నమస్తే!

పద్మావతి: ధ్యానంలో ఉన్నారా స్వామీ!

జయదేవుఁడు: పరధ్యానం కాదు పద్మా! సాధ్వివి నీ స్వాధీనంలోకే వచ్చాను.

పద్మావతి: (నవ్వుచు) విన్నారా, వింతవార్త!

జయదేవుఁడు: మన్నింపఁ బూనిన మహారాజు మన మందిరమునకు వచ్చు చేనా! ... భూమీశులే కాదు పద్మా మునీశులైన నీ దర్శనం అపేక్షింప వలసినదే! బృందావన సంచారి నన్ను వంచించినా, నీ ముందేగదా ప్రత్యక్షమైనాఁడు!

పద్మావతి: మీ రూపంలో నిత్య ప్రసన్నుడే! కానీఅండి, మీకో శుభ వార్త! రారాజు రాక కాదు. పెండ్లివార్త!

జయదేవుఁడు: పెండ్లివార్త!... ఎవరిది?

పద్మావతి: అన్నయ్యంటున్నారు, త్వరలో చేయాలి శారద పెండ్లి అని!

జయదేవుఁడు: శారద పెండ్లి! ఆహా! వధువుకు తగిన వరుఁడెవ్వరో!

పద్మావతి: ఏ మహాకవి పుత్త్రుఁడో ఉన్నాడట! రూపజిత మన్మథుఁడట!

శారద: (ప్రవేశించుచునే) లేదు మామయ్యా! కోపజితరుద్రుఁడు, భద్రుఁడు; దరిద్రుఁడు!

పద్మావతి: (విరగబడి నవ్వుచు) చూచేవా- శారదా! కవీంద్రుని కట్టుకొని యిన్నేండ్లైనా నాకీ కవిత్వ మబ్బనే లేదు!

జయదేవుఁడు: కట్టుకొన్న కల్యాణి కెలావస్తుంది కమనీయమైన కళ యేదే గాని! ఆత్మజనకైనా అంతేవాసికైనా రావలెగాని. ఇంతకూ కోపానికి కారణం చెప్పలేదమ్మా!

పద్మావతి: మీదంత విడ్డూరం! పెండ్లి విషయం కాబోయే పెండ్లి కూతు రెలా చెబుతుందండి!

శారద: చూచావా అత్తయ్యా!

పద్మావతి: మీ మామయ్య మాటల కేంలే అమ్మా!... నేనున్నానుగా! నాతో చెప్పవు!

శారద: (గద్గద కంఠంతో) అమ్మ ఉంటే నాన్న యిలా ఒత్తిడి చేసేవారేనా అత్తయ్యా!

జయదేవుఁడు: యశోదమ్మ ఉందిగా తల్లీ

శారద: అవునత్తయ్యా!... నాకెందుకు చెప్పండి పెండ్లి!

పద్మావతి: అదేమిటి శారదా! ... పెండ్లి అక్కరలేదా!

శారద: వద్దమ్మా, అత్తా! నాకీలోకంలో పెండ్లి వద్దేవద్దు!

పద్మావతి: అదేమిటమ్మా! శారదా! పెండ్లిండ్లన్నీ ఈ లోకంలో గాక మరేలోకంలో అవుతవి! మానవులం గదా మనం!

శారద: మనస్సున్న మానవులం గనుకనే ఆలోచింపగలం అత్తయ్యా మంచి చెడ్డలు! ఆలోచన వల్లనే అమృతం లభిస్తుందేమో!

జయదేవుఁడు: అమృతభావమే ఆనందం తల్లీ!... మరి అలా అని ఆలోచించావా అమ్మా, వివాహం వద్దని!

శారద : అవును, మామయ్యా! ఈ సామాన్య జీవనం, ఈ పెండ్లి పేరంటాలు నాకిష్టంలేదు !

పద్మావతి: పెండ్లికాకుండా యిలాగే ఉండిపోతావా శారద !

జయదేవుడు: ఔనా, అమ్మా! ఇలాగే ఉంటావా!...ఇది అతిలోకవిషయం తల్లీ ! బాల బాలికలు యుక్త వయస్సున ధర్మపద్ధతిన వివాహమై విధ్యుక్త సుఖాలనుభవించాలి కదా !

పద్మావతి: ఔనమ్మా ! అందుకనేగదా ఎక్కడ చూచినా తామర తంపర లాగా, కాచిపూచే కల్ప వృక్షాలుగా కష్టాల్లోను సుఖాలు ఆపాదించే కమ్మని సంసారాలు ఎలా వెలుగొందుతున్నాయో !

శారద : ఇదీ ఒక భావ కవిత్వం అత్తయ్యా ! మాయానాటకంలోని మాయ పాత్రలమ్మా యీ మనుష్యులనే బొమ్మలు ! వీరి పెండ్లిండ్లన్నీ బొమ్మల పెండ్లిండ్లమ్మా !

పద్మావతి: శారదకెన్ని మాటలెలా వచ్చాయండీ ! బ్రతిమాలినా ఫల్లెత్తి మాట్లాడ్డానికే సిగ్గు పడేది !

శారద : ఇందులో పాండిత్యమేముందత్తయ్యా ! సత్యం సాక్షాత్కరించుతూంటే సాదరంగా సందర్శించాను.

జయదేవుడు: అవునమ్మా! అర్హతనుబట్టి అన్నీ అవగతమౌతవి ! కండ్లకు గట్టినట్లు కలయథార్థం గోచరిస్తుంది ! ... ఇంతకూ ఇంత విరక్తి ఎలా కలిగిందమ్మా నీ సుఖానుభవమిమ్మాద!

పద్మావతి: పాల బుగ్గల పసిపాప దానికి వైరాగ్యమేమిటండీ ! .... తెలిసి తెలియని తనం ! అంతే ! కాకుంటే కళ్యాణం కలిసి వస్తూంటే కాదనగలదా !

శారద : నే ననేదేమున్నదత్తా ! అంతః కరణమే ఆలాపించుతున్నదీ అమర సంగీతం ! నేనేదో రొదవింటున్నానత్తా ఎదలో !

పద్మావతి: వద్దనే వింటున్నావా, శారదా, పెండ్లి ! ఎదలోని కొద మదనాలాపమేమో! రాగోదయం తల్లీ, ఆ అంతర్వాణి ఆలాపించినది!

జయదేవుడు: చూచావా, శారదా! అత్తయ్య......అసాధ్యురాలు ! నీ హృదయానుభవానికి ఎలాంటి వ్యాఖ్యానం ! స్వానుభవమేమో నమ్మా రాధకు !

పద్మావతి: చ్చు, చ్చు! మీ మామయ్యకేం తెలియవమ్మా, ఇలాంటివి ! అందులకే పాపం యీరక్తిలేని రాగం !

శారద: అత్తా, కాదత్తా! రసహీనం కాదత్తా నా హృదయం!...బృందావన వల్లవీ పల్లవులపై వ్రాలుతున్నదమ్మా, మనస్సు !

జయదేవుడు: ధన్యవు శారదా! భక్తికి పరమావధి బాలకృష్ణ సందర్శనమే !

శారద: సందర్శనం కాదు మామయ్యా!....సంబంధమూ కోరుతున్నాను!

పద్మావతి: ఏమిటమ్మా, శారదా !

జయదేవుడు: అహా ! మా చిట్టి తల్లి మనోవాంఛ మాధవాయత్తమైనది !

శారద: అవునత్తా ! ఆ గోపాంగనా సంగికే ఒసంగి కొన్నానమ్మా నా సర్వస్వము ! నా మనోవల్లభుడు ఆతడేనమ్మా !

పద్మావతి: శారదా !

శారద: అవునత్తా! నిశ్చయించు కొన్నాను.

పద్మావతి: సాధ్యమా తల్లీ ! అంబర విహారి చందురునాలింగన మాచరింతువు !

శారద: అందడందువా అత్తా! ఆ అందగాడు!... మంద భాగ్యను ... గోవిందుని పాదారవిందమే పట్టుకొనలేనా అత్త! ......వృథాయాసమేనా !...

జయదేవుడు: కాదమ్మా!........నంద నందనుడు నీపరిణయ సౌందర్యానికి ముగ్ధుడౌతాడమ్మా!...కాని...

శారద: కాని...!

జయదేవుఁడు: గోలోకధాముడు గోవిందుని కరగ్రహణం తల్లీ నీవు కోరినది! ఆశలు మంచివైనా!....

శారద: చిగురింప వసేనా చిక్కు!

పద్మావతి: చక్కని చుక్కవు, ఈ చిక్కులో చిక్కకు తల్లీ! కృష్ణ విరహంలో కృశించిన రాధగోడు చూచాముగదా!

శారద: రాధ ప్రయత్నం వ్యర్థమయిందా అత్తయ్యా!

పద్మావతి: ఫలప్రదం కాదని కాదు గాని...!

శారద: ఇంక భయమేమున్న దత్తా!

జయదేవుఁడు: సంశయించటం కాదు తల్లీ! ఆ దైవానుగ్రహం ఏనాటికగునన్నదే!

శారద: ఈ మాటలు మీవేనా మామయ్య! గట్టి పట్టున్నచో ఆ గోవర్ధన గిరిధారి అరక్షణంలో అనుగ్రహిస్తాడని మీరే చెప్పారు! మరీనాడు ...

జయదేవుఁడు: అవునమ్మా! తప్పక అనుగ్రహిస్తాడు. కాని కొన్ని ప్రతిబంధకాలున్నాయమ్మా!

పరాశ: (ప్రవేశించి. ఒదిగియుండి కనుపించుట_ అందుజరుగుచున్న విషయము గమనించునట్లు.)

శారద: నిర్నిబంధంగా బాంధవాన్ని కోరేబాలిక సంప్రార్థనం మామయ్యా! ..ఆ వనమాలి వామాంకం! ... ఆ నెమలి కన్నుల వెన్నెలాని వక్షస్థలం! ... ఆ వేణుగోపాలుని వంశీగానం! .... నాకు కరవౌతాయా! ... కృష్ణా! గో గోపీ మనోవల్లభా! ముల్లోక మోహనమైన నీ మోమందము, ... చలువలు వెదజల్లే నీ కలువకన్నులు, ... వెన్నెల వెలుఁగైన నీ లేనవ్వులు,: వేదాంత వీధుల విహరించే నీ పాదపద్మాలు, ... సాగరకన్యా

సాహ చర్యంలో ముచ్చటఁగూర్చే మచ్చిక,...సచ్చరిత్రుల సాన్నిధ్యం వీడని నీ సంగాతము,...కడుపార తిన్న వెన్నలో స్నిగ్ధమైన నీ మెత్తని చిత్తము... ప్రసాదింపవా యశోదా శిశూ! ప్రసాదింపవా ప్రభూ!... ( విగ్రహము చెంతవ్రాలి వెక్కి- వెక్కి మొఱపెట్టుట...గద్గద స్వరముతో__కన్నీళ్లతో )

పద్మావతి: పసిబిడ్డ ననుకొన్నానమ్మా!.... నీవు ప్రణయభక్తి పాలవెల్లి అనుకోలేదమ్మా!....బాల భావమని భ్రమించాను తల్లీ!

జయదేవుఁడు: అగాధమైన సుధానిధికి గట్లు తెగినది పద్మా! కమనీయమైన కాంక్ష!...కంజాక్షుని గుఱించిన కామం దోషరహితమైనదమ్మా!....తపించినా తరించే దివ్యమార్గం తల్లీ నీది!

పద్మావతి: లే అమ్మా!

శారద: కృష్ణా! ( లేచుచు ) కుబ్జా మనోజ్ఞ సంచారా!

పరాశర: (బయల్పడుచు) బావా! (ఆర్తితో)

పద్మావతి: రండి అన్నయ్యా!... లే అమ్మా!

జయదేవుఁడు: పండించావురా పరాశరా! భాగ్యం!

పద్మావతి: అవునన్నయ్యా! శారద నీ బంగారు పంట! మాకన్నుల కర్పూరం!

జయదేవుఁడు: కమలాకాంతుని కంఠాన కల్హారదామం!

పరాశర: మీ ఆశీర్వచనబలం అనుకొన్నానమ్మా, పద్మా! ( శారదతో అమ్మడూ! మామయ్యను సేవించిన ఫలం తుదకిలా ఫలించిందా తల్లీ!...శారద పెండ్లి తలపెట్టాను బావా!...కాని దీనివైఖరి చూస్తూంటే ..

జయదేవుఁడు: (చిఱునవ్వుచు) సుముఖంగా లేదు కదూ!... పరాశరా! అమ్మాయి అభిమతం అపూర్వమైనదయ్యా!

శారద : మీపట్టు విడువరా నాన్న !

పద్మావతి: కొన్నాళ్లోపిక పట్టండన్నయ్యా !

శారద : ఎన్నాళ్లయినా మాశేదేమున్నదత్తా !

పరాశ : (ఉద్రేకంతో) విన్నారా ఈ విరుద్ధం ! లోకాచారం విచారింప వలెంగదా...ఇంత విపరీతానికి కారణం నిత్యము ఇక్కడ ఈ భక్తి గోష్ఠిలో పాల్గొనటమేగదూ ! (జయదేవుఁడు చిఱునవ్వుట; పద్మావతి సంభ్రమము చెందుట; శారద ఉద్విగ్నయగుట)

శారద : నాన్న! మీమాటలకర్థంలేదునాన్న!...ఆలోచించి అన్నారా!

పరాశ : దీర్ఘంగా ఆలోచించే అన్నాను ! నిత్య కల్యాణంగా గృహస్థ ధర్మంలో ఉన్నారా, అత్తయ్య మామయ్యాను ! మఱి నీ యీవెడగు బుద్ధికి కారణం !

శారద : నా స్వబుద్ధి !

పరాశ : బుద్ధి!...బుద్ధిఉంటే ఇలా అనేదానివేనా!...ఏం....పెండ్లెందుకక్కఱలేదు !

శారద : ఈ కోపంలో మీకర్థంకాదు నాన్న ! ... ఇదివ్యక్తిగతమైన నిశ్చయం ! ఇందులో ఈ పూజ్యుల ప్రమేయంగాని ప్రబోధంగాని ఏమీలేదు నాన్నా !

పద్మావతి: పెండ్లాడ వద్దని పెడదారి పట్టించామా, అన్నయ్యా! మాతల్లి-శారద పెండ్లి కూతురై శోభస్కరంగా వర్ధిల్లాలనీ, ఆ శుభ సమయం ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తున్నామే! (గద్గదంగా) ఎలాంటినింద వేశారన్నయ్యా! మాయింటికి శారద రావటమే తప్పయిందా !

జయదేవుఁడు: శారదను చూడని నాకు శారదా కటాక్షమా !

శారద : లేదత్తా! మిమ్ము చూడకుండా బ్రతుకలేనత్తా!...మామయ్యా! మీ మాటలు, పాటలే నాకాహారం!... అవి, లేకుంటే నాకానందమేలేదు మామయ్యా!... నాన్న !

పరాశ : నాన్న! ... నాన్నమాట మన్నించావు కనుకనా! పరువు ప్రతిష్టలు ఆలోచించావా ! ఊఁ! నడుముందు! ... ఇల్లు వదలి ఎంత సేపైంది! ...

శారద : ఎన్నడైనా అన్నారా నాన్న ఇలా !

పరాశ : నోరుముయ్! కోపం తెప్పించక నడు ! ఊఁ ! ...

శారద: కొంచెముండి వస్తాను నాన్న! మీరు పదండి !

పరాశ : అలా వీల్లేదు ! ముందు పద ! ఊఁ !

శారద : ఏమిటి నాన్న యీ కోపం! అలా ఊరుకొన్నావా అత్తయ్యా! మాట్లాడ రేం మామయ్యా ! (ఏడుస్తూన్న శారదను పరాశరుడు లాగుకొని పోవు ప్రయత్నం)

పరాశ : ముగించావా లేదా ! రా ! ఇలారా !

శారద : మామయ్యా ! ... అత్తయ్యా ! (ఎలుఁగెత్తి)

పద్మావతి: (కండ్ల నీరు గ్రుక్కుకొనుచు)... ఏమండీ ! ...

జయదేవుఁడు: (నిబ్బరముగా) వెళ్లి రా అమ్మా ! నాన్న మాట విను! ... ఊరుకో పద్మా ! ఏమిటీ పిచ్చి !

శారద : అత్తా! నిన్ను వదలి ఉండలేనత్తా !

పరాశ : (చేతిలోని కఱ్ఱతో జడిపించుచు) ఊఁ ! కదిలేవా లేదా ! ...

పద్మావతి: కల్పించుకొన్న బాంధవ్యాలు కలకాలం వర్ధిల్లేనా తల్లీ !

శారద : అత్తయ్యా గుండె చెఱువై పోతూంది నాన్న !

పద్మావతి: పరవాలేదమ్మా ! ... అమ్మ హృదయం ఆర్తిలో ఆర్ద్రమైనప్పుడే ఆనందం తల్లీ! ... కానీ అండి అన్నయ్యా ! అమ్మాయి నేమనకండి! .... అల్లారు ముద్దుగ పెరిగింది .... అమ్మలేని లోపం నా అంకాన తీర్చుకొన్నది ! ... అందుకే యీ తీపి... పెంచిన మమకారం ! ...

శారద : అమ్మా! ... అత్తయ్యా !

పద్మావతి: (ముఖము చేతిలో కప్పుకొని దుఃఖించును) వెళ్లిరా తల్లీ !

శారద: వెళ్లొస్తాను మామయ్యా! గోపాల కృష్ణా! సెలవు!

జయదేవుఁడు: (మాట్లాడకయే ఆశీస్సు చెప్పుట)

పరాశ: నడు త్వరగా! రానున్న రారాజుకూడా చూడాలీరాద్దాం తఁ! ఊఁ! (శారదను ముందుకు త్రోయుచుండగా నిరువురునిష్క్రమింతురు)

జయదేవుఁడు: (దైవాన్నిగురించి)

పాట

పాలనె ముంచెదో నీటనె ముంచెదో
భారమంతయును నీదేరా-ప్రభూ !
బాలిక శారద ప్రణయ హృదయమే
పాలనజేసే వరదుఁడవేరా !
కూడునో కూడదో తెలియని గోలర___జేలర
గోకుల యమునా కూల విహారా !
అళికుల కుంతల, హరిగోపాలా
అబలామోహన ! అభయ మొసంగర
వధు విధి, మధుసుధ పరభృతవాణి
మధురిపు ! విభు ! చేకొను పాణి! ... పాలనె ...

తెరలో : (బోయీల ఓంకార ధ్వనులు; వేత్రహస్తుని ప్రవేశం)

వేత్రహ: జయ జయశ్రీ సేనవంశ పయః పారావార రాకా సుధాకరా జయశ్రీ లక్ష్మణసేన మహాభూమీశ్వరేశ్వర, జయతు జయతు!.. ఆర్యులు, జయదేవ కవీంద్రులు! (నమస్కరించుచునే) భూదేవేంద్రులు ... యిదో ... (మాటలోనే మహారాజు ప్రవేశం)

జయదేవుఁడు: ఏరీ, ఏరీ! మా మహారాజులుం గారేరి !

లక్ష్మణ: ఇదో మీ దర్శనాభిలాషతో తహతహలాడుతున్న మీ మిత్రుఁడు ! (పరస్పరా లింగన మర్యాదలు)

జయదేవుఁడు: మీ అభిమాన ప్రేమకు ఆద్యంతములు లేవు ప్రభూ ! .. లేనిచో భూరమా వల్లభులు మీరీ నిరుపేదల యింటికి !

లక్ష్మణ: ప్రేమకు పెన్నిధి ఆటంకమా, మహాకవీ !

జయదేవుఁడు: ఆనందంలో ఆదరణ మర్యాదలే మఱచాను ! మన్నించాలి (లోనికి పోవుచు) పద్మా ! ... అవనీ పతికి అర్ఘ్యపాద్యాలు!... అఁ! ఇలా తే ! (రాజునకు అందించఁబోవును)

లక్ష్మణ: అలా ఉంచండి ! ఆ చార దాంభికంలో ఆపేక్షలకు అంతః కరణకు తావే లేదు !

జయదేవుఁడు: చిత్తం ! ఇలా దయచేయండి ! (కుర్చీలో కూర్చుండఁ జేయుట)

లక్ష్మణ: (కూర్చుండుచు) ఉభయులము !

జయదేవుఁడు: చిత్తము ! (తానును కూర్చుండుట)

లక్ష్మణ: మాదొక అభ్యర్థన ! మా తల్లి పద్మావతీ సహితులై తా మీనాఁడే మా మందిరం పావనం చేయాలి ! భక్తుల పాద ధూళిలో పవిత్రింకాని వేమున్నాయి !

జయదేవుఁడు: ఎంతమాట ! ... మీ ఆతిథ్య గౌరవం అందుకోగల అదృష్టం అనల్పం ! ... కాని ...

లక్ష్మణ: ఏ అభ్యంతరము చెప్పకుందురుగాక ! ...

జయదేవుఁడు: నా అభ్యంతరమని కాదు, కాని...

లక్ష్మణ: మఱి మా అమ్మాయిదే నందురా అభ్యంతరం !

జయదేవుఁడు: ఏమో ! తండ్రి తనయుల ఆంతర్యం ! ... (లేచి లోనికిపోవు చున్నట్లు రెండడుగులువేసి) పద్మా ! ... ఒక మారు ! (ఆమెవచ్చి ప్రక్కన ఒద్దికగా నిల్చుండును) విన్నావా !

లక్ష్మణ: అమ్మఁడు మా అభ్యర్థన మన్నించదనేనా! . . . ఏమమ్మా!

పద్మావతి: నేననుట కేమున్నది! ఆడు బిడ్డను! పుట్టింటిపై ఆశ పెట్టు
కొనటం నేరం కాదుగదా!

లక్ష్మణ: ధన్యోలం తల్లీ! . . . ఇంక మీ సంశయము తీరినట్లేనా!

జయదేవుఁడు: సదా శయంలో సందేహానికి చోటెక్కడ ప్రభూ!

లక్ష్మణ: భద్రా! అందల మాయత్తమేకదా!

భద్రుఁడు: చిత్తం ప్రభూ!

లక్ష్మణ: (జ. తో) ఆలస్యానికి అవసరముండదేమో!

జయదేవుఁడు: లేదు ప్రభూ! పద్మా! బయలుదేర వచ్చును!

లక్ష్మణ: భద్రగజముపై నా పక్కనే మీ రాక!

జయదేవుఁడు: చిత్తము!

( తెర జారును. )

—o—

# ఆ ర వ   రం గ ము

( పరాశరుని యిల్లు _ శారద పరాశరుడు )

( తెర యెత్తఁబడును. )

పరాశ : (శారదను లాగుకొని వచ్చుచు) ఇంక యిల్లు కదిలావా! కాళ్లు విఱుగు తయ్! జాగ్రత్త ! అమ్మా, ఏమో అనుకొన్నాను ! నన్నే ఎదిరించే దానివైనావుగా !

శారద : (వెక్కి- వెక్కి- ఏడ్చుచు) ఎదిరించానా, నాన్న! అత్తయ్యను చూడ కుండా ఉండలేనన్నాను ! మామయ్యను పలుకరించకుండా ఉండ గలనా అన్నాను !

పరాశ : అవును; అది కూడదనే అన్నాను నేను !

శారద : తప్పేమున్నది నాన్న ! అన్ని మాటలు మీవే ! ఒకప్పుడు మీరే అన్నారు: "అమ్మడూ! అత్తయ్యేనమ్మా, ఆధారమని ! మామయ్యకంటె మనకాప్తులు లేరని!"

పరాశ : ఎప్పటి మాటలో అవి! ఇప్పుడవి చెల్లవు !

శారద : కాల క్రమంగా బాంధవ్యాలు మారిపోతాయానాన్న !

పరాశ : బాంధవ్యాలు, స్నేహాలు బాధాకరమైనప్పుడు స్థిరంగా చిరకాలం ఎలా సాగుతయ్ !

శారద : అవసరం తీరంగానే అదృశ్య మౌతాయా, ఆదరాభిమానాలు ! అంతఃకరణమే అంతర్థాన మవుతుందా నాన్న !

పరాశ: అవన్నీ కట్టిపెట్టు ! ఇలాంటి కవిత్వాలు నేను చెప్పాను ! ... ఇదిగో శారదా ! ఒక్క-మాట చెబుతున్నాను !... ఇదంతా నీ మంచికే !

శారద : అవును ! అల్లారు ముద్దుగా పెంచిన అత్తయ్య హృదయం అర్థం చేసికోకుండా అనరాని మాటలనటం నా మంచికే ! నామంచికే కదూ నాన్న, మామయ్య వంక మంటలు కురిపించటం !

పరాశ : ఇన్నిటికీ నీవే కారణం , ఇంతకంటె మూర్ఖం ఉన్నదా! వన్నెకు వాసికెక్కిన వంశంలో పుట్టానన్న జ్ఞానం ఉన్నదా నీకు!

శారద : అజ్ఞానంగా అకార్యం చేశానంటారా ! అదుపాజ్ఞల్లో అణగి మణగి లేనంటారా నాన్న !

పరాశ : ఇదేనా జ్ఞానం ! ఈడు వచ్చినదానవు, ఇహపరాలకు రెంటికీ అవసరమైన వివాహంవద్దనటం ! ఇదేనా వంశ మర్యాద ! ఇదేనటమ్మా కులాచారం !

శారద : నేను చేసిన దురాచారం ఏముంది చెప్పండి నాన్న! మనస్సు - వాక్కు - కాయం మాధవార్పితం చేశాను! ప్రేమసముద్రుడా వెన్న దొంగ! వానికే ప్రేమోపహారం వేశాను నాన్న !

పరాశ : చాలించు! ఇదంతా నీ ప్రణయ సాహిత్యం!.... స్వయంవరానికి నీవేమి రాచబిడ్డవు కావు!...తల్లి గతించినా ధర్మా ధర్మ వివేకం గలిగిన తండ్రి యింక బ్రతికే ఉన్నాడు !

శారద : కృష్ణ! కృష్ణ! ఇవేం మాటలునాన్న ! కన్నతండ్రి కారుణ్యం కల కాలం వర్ధిల్లాలి !

పరాశ : కనుకనే కల్యాణం నిశ్చయించాను ! కన్న కుమార్తెవు, కలవారి యింట్లో కళాలక్ష్మివై గంపెడు బిడ్డలతో కన్న తల్లివైతే చూడాలని కాంక్షించాను ! పుట్టినింటికి మెట్టినింటికి పుణ్యాల ప్రోవులు పండిస్తావనుకొన్నాను! నా ఆశలన్నీ నిరాశలు చేయాలనుకొన్నావు !

శారద : భాగ్యలక్ష్మికి భర్తగదా నాన్నా, పరంధాముడు ! పుణ్య ఫల ప్రదాత నాన్న ఆపూతనా సంహారి ! ఆ వరప్రదాత అనుగ్రహించాడా తరతరాలుగా చేసిన పుణ్య తపస్సుల ఫలం...

పరాశ: నిష్ఫలం కాకుంటేచాలు! శారద! ఇవన్నీ కట్టిపెట్టు! నీ ఉప న్యాసాలు వట్టి ఊఁకదంపు! ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికి మెట్లు కట్టిందఁట! ... పిచ్చిపిల్ల! నేచెప్పినట్టువిని బాగుపడు!

శారద: బాగోగులు నిర్ణయించేది మనంకాదునాన్న! విధి యెలా ఉంటే అలాజరుగుతుంది!

పరాశ: విధి! నీవిధి నాచేతిలోఉందిశారదా! తండ్రిశాసనం ఇది నా అధీనంలోనే ఉన్నది నీబ్రతుకంతా!

శారద: అంత నిర్దయులుకారునాన్న మీరు! తండ్రిశాసనం కంటెను బలమైనది తండ్రివాత్సల్యం!

పరాశ: ఏదైనా హద్దులో ఉన్నంతవరకే శారదా! మేఱమీరిందా!

శారద: చేయగలిగిం దేమీలేదునాన్న! భక్తులఁబ్రోచే బాధ్యత భగ వంతునిదే! ప్రహ్లాదవరదుఁడు నాన్నా!

పరాశ: ఆఁ.. ఏమన్నావ్! శారద! నేను నీపాలిటి రక్కసుఁడనా! రాక్షసీ! అవును, నీపాలిటి హిరణ్యకశ్యపుడనే! (గుడ్డమెలియ బెట్టి గొట్టును) ఎంత పొగరేనీకు! జయదేవ మఠంలోఁజేరి జే సీతారామ్! ఇదేనా నేర్చింది! (కొట్టును)

శారద: హా! కృష్ణా, కృష్ణా!...అమ్మా! అత్తా!

పరాశ: ఆ పాడుకూఁత కూశావో చీల్చేస్తాను నాలుక! వాళ్లతో అవసరం తీరింది!

శారద: గోవిందకృష్ణా! గోపాలకృష్ణా! గరుడవాహనా! కరుణింపవా!

పరాశ: గరుడవాహనుఁడే వస్తాఁడో! గజవరదుఁడే వస్తాఁడో నాకేమీ అక్కఱలేదు! నీవు నేను నిశ్చయించిన సంబంధం చేసికోవ టమే కావాలి! అలాచేసికొన్నావా నీ వివాహార్థం మహారా జిచ్చే వివిధాం బరాభరణాలు కొల్లలుగ నీకే కట్టపెడతాను!

శారద: వారికి కూడా తెలిసిందా నాన్నా, మీ నిశ్చయం!

పరాశ : తెలియటమేమిటి! సంబంధ నిశ్చయంలో వారి చాతుర్యము కొంత పనికి వచ్చింది. అందుకనే ఆయనగారు "అమ్మాయి పెండ్లి భారం మాపైన కొంత వేయండి" అన్నారు.

శారద : మీరు పూర్తిగా వేశారేమో !

పరాశ : వేయక తప్పుతుందా! రాజుల అనుగ్రహం ఉంటేనే రత్నరాసులైనా, కీర్తి ప్రతిష్ఠలైనా ! ఇలాంటి ప్రశస్తమైన శుభ ప్రస్తావనలు వచ్చినప్పుడే గదులు గాదెలునింపే అవకాశం ! లేకుంటే నిత్య దరిద్రమేగా !

శారద : మహారాజైనా మానవుడేకదా నాన్న! మరి వారి అనుగ్రహం శాశ్వతమెలా అవుతుంది !

పరాశ : ఆ మాటకొస్తే మనం మాత్రం శాశ్వతమా ! ఏమో ! ఈ భూమిమీద ఉన్నన్నినాళ్లే హాయిగా!...

శారద : ఈ రోత బ్రతుకే హాయిఅంటారా నాన్న ! భాగ్యానికై ప్రభు వన్నవాని పాదాలు పట్టటం !

పరాశ : శారదా! నన్నవమానిస్తున్నావు! జాగ్రత్త! ఒడలు, చీరేస్తాను! ప్రాణాలులేని బొమ్మల పాదాలు భజించే వెఱ్ఱి కుంకవు నీవా తప్పు పట్టటం !

శారద : పోనీ ప్రాణాలున్న తోలుబొమ్మలనే పూజించండి !

పరాశ : (దెబ్బ వేయుచు) మాటకు మాట చెబుతావా, మూర్ఖురాలా చివరమాటగా చెబుతున్నాను ! నా యిష్ట ప్రకారం జరగవలసిందే ! లేదా !

శారద : చంపేస్తారా నాన్న !

పరాశ : ఆఁ...అన్నం నీళ్లు లేకుండా అలమటించాలి ! తెలుసా !

శారద : అన్నం నీరు కాని అమృతమే సేవిస్తాను !

పరాశర : అదీ చూస్తాను! ఈ క్షణంనుంచీ ఇంట్లో పొయ్యి రాజేశావా! జాగ్రత్త !

శారద : మీకైనా వండ వద్దంటూరా నాన్నా !

పరాశర : (తడబడచు) నా సంగతి నేను చూచుకుంటాను ! (నిష్క్రమణము.)

శారద : అవును ఎవరికివారే యమునాతీరే !...... (నవ్వుచు పాట ఆలాపించుట—ఒకటి రెండు చరణములు మాత్రమే)

"యమునాతీరే .....ధీర సమీరే......."

ఇంక నీదే భారమయ్యా, భక్తావనా ! .. అనుగ్రహమో ! నిగ్రహమో !.... అందించేవా నీ అభయహస్తం ! ప్రభూ ! పొందించవా నీపుణ్యధామం !

( తెర జారను )

# ఏడవ రంగము

[ రాజ మందిరం అంతఃపురము — మహారాణి వినయరక్షిత ]
(తెర యెత్తబడును.)

వినయరక్షిత : (తనలో) నేనే పొరపడుతూన్నానా! ప్రజా బాహుళ్యం చేసే పొగడ్తలలో - పూజా గౌరవ సత్కారాల్లో గర్వించి కన్నుగానదేమో, అనుకొన్నాను. పద్మావతీదేవి, నిజానికి ఆమె మధుర మంజులమైన ముగ్ధమూర్తి నన్ను ఆకర్షిస్తూంది!.... ఆమె అంద చందాలూ కావు, నాట్య నైపుణ్యముగాదు! ఏదో మహనీయమైన పవిత్రభావం ఆమెలో ఉన్నట్లున్నది! లేకుంటే, ఇంతవరకు కొంత అసూయాభావంతో ఆలోచించానే ఆమెనుగూర్చి! మఱి నామనసే మారటానికి కారణం! అదినాలోని బలహీనం కాదుగదా! ఏమో! అవునేమో!... కాదు....కర్తవ్యం పట్ల కాఠిన్యం రాచబిడ్డకు జన్మతఃవచ్చే గుణం! ద్వేషంగా కాకపోయినా తెలిసికోవాలనే దీక్షతోనైనా పద్మావతీ సతి ప్రభావం పసిగట్టాలి! ఎవరది! ఆమే వస్తున్నట్లున్నది! (వీణ మీటుచు పాడుట.)

పాట

"సుమదళఫల భార వినమ్రత
సుందర తర తరుశోభా!
మాతా ప్రకృతి! మాతా సుకృతి!
వందనమమ్మా వసుమతి దేవీ!"

(ఆలాపించుచుండగానే పద్మావతి ప్రవేశము)

పద్మావతి: (ప్రవేశము)

వినయ : ఇలా రావాలి!

పద్మావతి: (దూరమున నుండియే) ఉచితాసనం తల్లీ ఇది! ఇక్కడ కూర్చుంటాను !

వినయ: అలా కాదు ! నాకు దగ్గరగా కూర్చోవాలి !

(అని తన వినయాశయమునకు తానే అద్భుతపడినట్లు వ్యక్తము చేయుట.)

పద్మావతి: పాట మధ్యలో ఆపారు !

వినయ: ఇంపుగా ఉన్నదంటారా !

పద్మావతి: కోయిల కూతగా పాడదా మరి! సంగీతం సరస్వతి నోటనే గదా వినాలి !

వినయ: అయిన వారిని గురించిన అతిశయోక్తులమ్మా !

పద్మావతి: కాదు తల్లీ! ఉన్న మాటన్నాను! నీ స్వరమాధుర్యం నాకుం జెనా గీత గోవిందం జేగీయమానంగా పాడేదాన్ని! ఏదమ్మా నీ పాట ! విందాం !

వినయ: పాడవలసినదేనా !

పద్మావతి: అడుగవలెనా! నా రాకవలన ఆపారు! మీ ఆనందానికి అంతరాయం కల్పించాను !

వినయ: మించినదిలేదు. వినండి!...కాని నా ప్రార్థనా మన్నించాలి ! ఆ తరువాత మీరూ పాడాలి !

పద్మావతి: నచ్చవేమోననే భయం !

వినయ: లోకమంతా మెచ్చుకొన్న వేగదా, మీ గానాభినయాలు ! నాకు మాత్రం ఎందుకు నచ్చవు !

వినయ: (పాడుట)

పాట

సుమధళ ఫల భార వినమ్రత

సుందర తర తరు శోభా !

" " తను శోభా !

మాతా ప్రకృతి ! మాతా సుకృతి !
వందన మమ్మా ! వసుమతి దేవి !
చుంబిత నభ నానా నగధర !
సురుచిర చిరపుణ్యాధార !
జలధర వేణీ సరసిజ పాణీ !
చంద్రకలా సమ చారు కపోలా !
నిర్మల రసరాగ నిధానా !
నిత్య వినిర్మల జీవ నిధానా !
యశో పూరిత దిశదశ ! అమ్మా !
అసదృశ సర్వదశా ! ... అమ్మా వసుమతి దేవి! ...

పద్మావతి: చెవుల పండువు చేశారు ! మీగాననైపుణ్యం కొనియాడ తగినది ! కాని...

వినయ : కాని!...చెప్పబోతూ ఆపారు !

పద్మావతి: ఆ కీర్తనకారుల భావమేమోనన్నదే సంశయము ! ప్రకృతి వర్ణనమేనా! లేక ప్రకృతినే ఆరాధించెనా అని !

వినయ : చూస్తూన్న సత్యంగదా ప్రకృతి ! సర్వ సృష్టికిమూలం ఆ ప్రకృతీ మాతగదా! అంతకంటెను పూజ్యదైవం ఉండటాన్ని ఊహించలేంగదా !

పద్మావతి: కనుపించే జగత్తే కారణం గాదుతల్లీ సృష్టికి! ప్రకృతీ సృష్టింపబడినదే !

వినయ: జగత్కర్త వేరే ఉన్నాడంటారా! ఉంటే ఒకనాడైనా కన్పింపరాదా! తన సృష్టితో తనకేమీ సంబంధమే లేదా !

పద్మావతి: ఈ విషయం చర్చించేటప్పుడు మమకార అహంకారాలు అడ్డురాకూడదు తల్లీ! (నవ్వుచు) క్షమనుకోరు కదా! చిన్నిప్రశ్న! ఇప్పుడు మహారాజులుంగారు ఉన్నట్లేనా !

వినయ: ఇదేంపశ్నండి! వేటకేగిన మహారాజులుంగారున్నట్లే కదా! లేరనటం సాహసమౌతుందికూడాను! వారివెంటనే పూజ్యులు జయదేవ కవీంద్రులూను!

పద్మావతి: ఉన్నారమ్మా! మన కండ్లఎదుట లేకున్నా ఉన్నారనే కదా నమ్మాం!

వినయ: కంటికి దూరమైనా అంతకుముందు కనుపించేవారే కనుక ఉన్నట్లే! వేటనుండి నేడుకాకపోయినా రేపయినా వస్తారుగనుక వారున్నట్లే

పద్మావతి: అదంతా విశ్వాసం మీద ఆధారంతల్లి! ఇప్పటికి లేరుగదా యిక్కడ!

వినయ: మీరీమాటలు మానండి!... చెవులలో సూదులు గ్రుచ్చినట్లున్నాయి! ఎక్కడనో అక్కడ వారుండవలసినదే! తప్పదు లేకుంటే!

పద్మావతి: తప్పక ఉన్నారమ్మా! అలాగే దైవమూను! ఆదైవాన్ని ఈ కన్నులతో నిత్యం చూడలేము! కాని వానిమహిమ ప్రసన్నమవుతూంటుంది ఈ ప్రకృతీ చిత్రంలో! అందుకనే ప్రకృతిని అద్దంతో పోల్చ వచ్చును! (ఒక చిత్రంవంక చూపుచు) ఈ చిత్రం సత్యమేనా! లేక దానివెనుక నేమైనా సత్యమున్నదా!

వినయ: ఇది కనుపించినా సత్యంకాదు! కారణం! దీనిని రచించిన చిత్రలేఖకుని మనస్సు - వాని సంకల్పము - వాని ఉనికి ఉన్నాయి గదా!

పద్మావతి కనుకనే దీని సత్యం వేరన్నమాట! ఇది ఒకనిసృష్టి. వాని కల్పనాశక్తికి ఒక నిదర్శనం మాత్రమే కదూ ఇది!

వినయ: అమ్మయ్యో! నేడొక అగాధంలో దిగబడ్డాం! తల తిరుగుతూంది! పోనీయండి ఆ విషయం! కమ్మని మీగాత్రం విందాం! కానీయండి!

పద్మావతి: ఇలాగేనమ్మా! సత్యవిచారం సహింపరానిదనే భక్తిమార్గం సుల భోపాయమన్నారు తల్లీ, తరించటానికి ప్రతివారికి! ఏమిపాడను;

వినయ: మీకు నచ్చినదే! దానికి తోడుగా వచ్చిన నాట్యంగూడాను!

పద్మావతి: భారం పెద్దదైనా ప్రేమతో అడిగారు! (పాట; ఒక అష్టపదియు పాడుచు నృత్య మొనర్చుట.)

పాట

జగదోద్ధారిణ! జలజాతేక్షణ!
జలదామ తను! చంద్రవదన కృష్ణా
కర్తవు భర్తవు హర్తవు నీవే
కార్య కారణ కల్పన నీదే
కాలము నీవే కాలుండ వీవే
కరుణయునీదే కార్యశినీదే
గగనసూర్యులు ఖేచరసిద్ధులు
గంగా సింధులు కాశీగయలు
తుంగ శృంగ హిమవన్నగములు
మంగళభృంగీ సంగీతమ్ములు
రంగనిమూర్తి లింగనికీర్తి
అన్నియు నీవే ఆత్మారామా!
అరయుము మము అఖిలాధారా!

వినయ: మనస్సుకేదో ఒక విధమైన ప్రశాంతత! కమ్మనిగాత్రం! కమ్మ ...ఏమనాలో తెలియటంలేదు!

పద్మావతి: పాటలో కలిసిన కవి హృదయం రసమయం తల్లీ! వారే భక్తి భావించి రచించారో, ఆభావమే పాడేవారిలోను వినేవారిలోను ప్రతి బింబించుతుందమ్మా! అందుచేతనే మనస్సుకు శాంతి! ఆ శాంతివల్లనే బ్రహ్మానందమూను!

(తెరలో రోదనము)

వినయ: ఏమది!...

పద్మావతి: ఎవరిదో ఆర్తనాదం తల్లీ!

వినయ: (ప్రక్కకు పోయి చూచుచు) చూచారా, అమ్మా! ఓ పతి వ్రత...!

పద్మావతి: పతివ్రతకు ఆపదా తల్లీ! (తాను వెళ్ళిచూచి నిట్టూర్చును.)

వినయ: పాపము! సహగమనం చేయబోతున్న ఈ తల్లిహృదయం ఎలా కొట్టుకొంటూన్నదో! రాళ్లు కరిగేనమ్మా నీయేడ్పుతో!.. అయ్యయ్యో! అడుగులు తడబడుతూన్నవి ఆమెకు!.. ఎలా వెళ్లగలవుతల్లీ!

పద్మావతి: ఎక్కడకమ్మా వెళ్లవలసినది!

వినయ: తెలియనట్లంటున్నారు! స్మశానానికి!

పద్మావతి: ఎందుకమ్మా అంతదూరం! సహగమన నికి పోయేతల్లి వీధుల వెంట ఊరేగేనా అమ్మా!

వినయ: మీ మాటలు విపరీతంగా ఉన్నాయి! కాటివరకే పోకుండా సహగమనమా!

పద్మావతి: అవునమ్మా! సహగమనానికి కాటికి పోనక్కఱలేదు చితులూ ఎక్కనక్కఱలేదు!

వినయ: అద్భుతంగా ఉన్నాయి మీ మాటలు! మాటలకేం ఎన్నైనా చెప్పవచ్చును!

పద్మావతి: అవునుతల్లీ! చేతలు చేతనయినప్పుడే మాటలవిలువ!

వినయ: సరి సరి! ఈ దృశ్యంతో మనస్సు వికలమౌతూంది! కొంచెం....

పద్మావతి: విశ్రాంతి అవసరంతల్లీ! అలా పాన్పుపై మేనువాల్చి భగవంతుని స్మరించుకో అమ్మా!

వినయ: అలాగే! మీరూ విశ్రాంతి తీసికొనండి!

పద్మావతి: అలాగే! ఎక్కువ విచారించకండి! (నిష్క్రమణము)

వినయ: ఇది అహంకారమా! అతిశయమా! [illegible]ఎక్క[illegible]నక్క లేకుండానే సహగమనంచేయటం సాధ్యమా! అయినా అదీ చూస్తాను! ఎవరక్కడ! (ప్రవేశం) ఇలా రా! నే చెప్పినట్లు చేయాలి!... (ప్రక్కకుపోయి రహస్యముగా జయదేవుడు మరణించినట్లు వార్త తెమ్మనుట)

భద్రుడు: అమ్మా! అమ్మా! ... ఈ ఘోరం నేను చేయలేనమ్మా!

వినయ: పిచ్చివాడా! భయంలేదు! నేను[illegible]

భద్రుడు: ఎలా చెప్పనమ్మా! జరగని విషయం — కాని మాట!.. ఈ వార్త వింటే పద్మావతీ దేవిగా [illegible]

వినయ: ష్! అతిగా మాట్లాడకు! ఇది నా ఆజ్ఞ! పో!

భద్రుడు! చిత్తం తల్లీ! ... ఓ భగవంతుడా! ([illegible]) (నిష్క్రమణము)

( తెర జారును. )

—0—

( తెరముందు )

( పరాశరుని ప్రవేశం: వ్యాకుల చిత్తంతో )

పరాశ: పెంకెతనం అందామా! పెంకెతనమూ కాదు! తెలియని తనం అందామా, తెలిసినవారికి తెలియని తెన్ను! దుర్బోధల దుష్ఫలితమా అంటే దుర్మార్గమూ కనబడదు! ఎలా తేలేది దీని విషయం! ఎలా ఏడ్చేది మనస్సెందుకు బుద్ధి! ...... పసి బిడ్డయినా పట్టినపట్టు గట్టిదిగదా! ఎలాచావను! .... అన్నం నీరు ముట్టక అయిదునాళ్ళయిందే! ఆహారం లేక అసువు లుండేనా! అల్లారు ముద్దుగా పెంచిన ఆడపిల్ల! ఒక్కగానొక్క నిసువు! ఓర్పులో వసుంధర; నేర్పులో నేర్పు! ధనంగా పెంచి ఘనంగా పెండ్లిచేద్దామనుకొన్నాను!...వివాహమెలా ఉన్నా కాలం ప్రవాహంలా పరుగెత్తుతూంది! గడియ గడిస్తే ఏమవు తుందోననే భయంతో గడపవలసివచ్చింది! మొన్నటికంటె నిన్న, నిన్నటికంటె నేడు బలహీనత మెక్కువై పోతూంది!... పచ్చి మంచినీళ్ళయినా ధారకం కావటంలేదు! మా అమ్మడు నాకు దక్కేనా! అమ్మా శారదా!... ( నిష్క్రమణము. )

# ఎనిమిదవ రంగము

[ పరాశరుని యిల్లు: పూజా మందిరం; శారద పూల సజ్జతో తులసీ దళములు – పూలు తెచ్చుట; నిరాహారయగుట చే అడుగులు తడబడు చుండును—దేవతా మంటపమునుజేరి స్వామికి మాలా సమర్పణము చేయుట. విషాద గీతాలాపనము. ]

శారద: అక్రూర వరద!...అరవిందాక్ష!... కృష్ణా ! కృష్ణా !...అన లేనయ్యా!.. అసువులు.. నిలుపవింక ...ప్రాణ ప్రయాణం!.. నూం! ఊం!... ఈ జీవితంలోనే....నిన్ను కలిసికోవాలి!.... నీ పదపంకజం చెంత నా శిరస్సు వాలేనా!.... నీకోమల కరపల్లవాలతో...నన్ను గుచ్చియెత్తేవా!... స్వామీ...స్వామీ... స్వామీ! రాధా మాధవ!.... ఈ వనమాల అందుకోవూ (దండవేసి పడిపోవుట) గోపాలకృష్ణా !

( సద్దువిని తడబడుచు పరాశరుని ప్రవేశం. )

పరాశ: అమ్మా! శారదా! నాతల్లివిగదూ! పడ్డావా తల్లీ! ఉండు... లే....అమ్మా! (కదలించుచూ) శారదా - శారదా! నాబంగారు తల్లివమ్మా! లే అమ్మా నావైపుచూడవు! అవునమ్మా కఠినాత్ముణ్ణి! అనరాని మాటలన్నానమ్మా! మూర్ఖుణ్ణాయినాను తల్లీ! నాచేతులు కాలిపోయినవమ్మా!....కన్నతల్లికి కఱవైన కసుగాయవు - పశువును కొట్టినట్లు కొట్టానే! కోపించావా తల్లి!...కన్నెత్తి చూడమ్మా! మా అమ్మవుగదూ నీకోర్కె చెల్లిస్తానమ్మా! ఒక్కమాట! ఒక్కమారు నాన్నా అనమ్మా నా సర్వస్వం నీకే ధారబోస్తాను!... మహాపాపిని! అన్నాహారాలు లేకుండాచేసిన కిరాతుణ్ణి! పుత్రికావాత్సల్యం చంపుకొన్న పెనుభూతాన్ని! నా అపరాధానికే శిక్ష విధించినా చాలదు! రవరవాది నరక బాధలు నా పాపానికి నిష్కృతి

కాజాలవు! అయ్యయ్యో! నాయీ గృహదీపం ఆరిపోయేనా!.. పరాశరా!...నీ నిశాచరత్వం బట్టబయలైనది! పాప పంకిలంలో పడి పతితుండైనావు! నీమూలకంగా పవిత్రమైన నీవంశంమైల పడ్డదిరా పశువా! నీ విద్యావైదుష్యం నీ నిష్ఠాచార సంపదలు భ్రష్టమైనాయిరా! దుర్బుద్ధీ! కన్న కడుపును కాలదన్నిన కాలుష్యం కట్టి కుడుపుతుందిరా! చేజేతుల వంశోన్మూలనం జేసికొన్న చండాలుండవు! అవును. ఏడ్వవలసినదే!...ఏమది! మా అమ్మడు కదిలిందా! అమ్మా! అమ్మా! .... శారద!

శారద: (నెమ్మదిగ కదలును; నోరు తడియారుటచే నోరు తెరచును.)

పరాశ: (తలక్రింద ఒత్తు పెట్టుచు) .... ఇదో.... నీ కామధేను విచ్చిన కమ్మని పాలమ్మా! గుక్కెడు తాగమ్మా! తెరు తల్లి నోరు!

శారద: తలఆడించుచు-కృష్ణ విగ్రహం దగ్గర ఉంచిన పాత్రవంక చూపుట)

పరాశ: ఇవి పనికిరావా అమ్మా!... కృష్ణయ్యకిచ్చిన గోక్షీరమే కావాలా తల్లి! (పాలు తెచ్చుచు) ఆ భక్త కామధేనువే బ్రతికించాడు! ఇదిగో గోపాలతీర్థం!

శారద: (నోరు తెఱచుటయు, ఆతడు పాలు త్రావించుటయు)...చాలు నాన్నా! నాకింకా... ఏ ఆహారం వద్దు! ఉన్నంతసేపు ఉండబోను ఆజ్ఞవచ్చింది నాన్నా!

పరాశ: శారదా! అమ్మ! ఆ మాటనకమ్మా! నా గుండె బ్రద్దలవుతూందమ్మా! నన్ను క్షమించు తల్లి!

శారద: తప్పు నాన్నా! నా తప్పులన్నీ క్షమించండి! నాకోర్కె చెల్లించండి!

పరాశ: తప్పక చెల్లిస్తానమ్మా! నా నిశ్చయం మార్చుకొంటాను! నీవిలాగే ఉండిపోదువుగాని; వివాహమే చేయనమ్మా!

శారద: నిజంగానా నాన్న! మనస్పూర్తిగా అన్నారా!

పరాశ: నిజంగానే తల్లి! నీవు నట్టింట్లో నర్తించితే అంతేచాలు !

శారద: ఆశలు పెంచుకోకండీ! దుఃఖం దురంత మవుతుంది! నా తుది కోర్కె నాన్నా! చెల్లించరూ !

పరాశ: సత్యంగా చెల్లిస్తాను! చెప్పమ్మా, చెప్పమ్మా !

శారద: ఒకసారి అత్తయ్యను మామయ్యను చూడాలనుంది! నా జీవితంలో వెలుగుతోవ చూపించిన గురుదేవులు నాన్నా! మీ దయవల్లనే వారిని సేవించగలిగాను!...వారిని...

పరాశ: అహంకారం చచ్చిన నాకే సందేహంలేదు! ప్రార్థించి తోడ్కొని వస్తాను!...కాని...

శారద: భయంలేదు నాన్నా! వారి దర్శనంకోసం, మీ అనుజ్ఞకోసమే బొందిలో చేరాయి ప్రాణాలు !

పరాశ: కొంచెం పాలు త్రాగమ్మా! త్రాణవస్తుంది !

శారద: అలాగే నాన్నా! మీరు త్వరగా రావాలి !

పరాశ: క్షణంలో వస్తానమ్మా అంగలం! (నిష్క్రమణము.)

శారద: (కృష్ణుని గుణించి) నాన్న నాయూస పెట్టావా, నందనందనా!... మామయ్యను చూచిరమ్మంటివే, పరంధామా!... అత్తయ్య ఆశీస్సు పొందుమంటివే!... విన్నావా! నాన్న మన్నించారు నా కోర్కె!...ఆలస్యం చేయను..ఇదిగో..వచ్చేస్తున్నాను!..

(మరల పడిపోవుట.)

# తొమ్మిదవ రంగము

( అడవిలో శిబిరంలో — అర్ధ రాత్రివేళ — లక్ష్మణసేనుడు, జయదేవుడు — నిద్రా ప్రయత్నం. )

( తెర యెత్తబడును. )

జయదేవుడు: అలాగే! వినిపిస్తాను! (ఒక అష్టపది పాడివినిపించును)

లక్ష్మణ : (వినుచునే నిద్రావశుడగును.)

జయదేవుడు: పరిశ్రమ ఫలితంగా ప్రభువు మేనువాల్చారు!... ఎందులకో ఉత్సాహమే రాలేదీ వేళ!... మనస్సెందుకో స్థైర్యం చెందుట లేదు! అకారణమైన హృదయోద్వేగం!.. ఈ అవయవకంపన మెందులకో! అపూర్వమైనదీ అనుభవం!... అర్థం లేదేమో యీ వ్యథా భయంబో: ప్రభూ! భయాపహారి! భక్తావనా!.. ఈ విచిత్రానుభవం విచార్యం తండ్రీ!... (పరుండ యత్నించి - లేచి) ఇదేమి, అద్భుతం! ఉన్నట్లుండి దుఃఖము పొంగుతూంది!... రమారమణా! . పాపం, మహారాజు గాఢనిద్రలో ఉన్నారు!.. ఎందుకోయీ తొందర!.. ఎవరికేగాని, ఏదైన ఆపద సంభవింపదుగదా!.. అవును!.. మా చిట్టి తల్లి - శారద చిరసౌఖ్యాపేక్ష!... ప్రియాంగన పద్మావతికి అన్నివేళల భద్రమే యగును! ప్రియజన వియోగమే భీప్రదమేమో!.. వృథాకీడును శంకించుచున్నాను!... కరుణాసింధుడు - కాంచన చేలుడు కావను బ్రోవను ఆతడే గలడు!... కృష్ణా! కృష్ణా! చిద్విలాసవిలాస! శ్రీనివాస! చిత్తశాంతి ప్రభూ! భిక్ష భిక్ష! దయాభిక్ష! (తిరిగి నిదురింప ప్రయత్నము — పరుండును. కాని మరుక్షణమే ఉలికిపడి పలవరించును) ఎవరు! ఎవరిది! నీవా అమ్మా! కన్నీరా తల్లీ, నీ కాటుకకండ్లకు!.

శారదా!.. పిలువ వచ్చేవా తల్లీ!... వస్తున్నానమ్మా! వస్తున్నానమ్మా! .. చేయందించు తల్లీ! (లేచుచు) ఆఁ, ఆఁ! ఇలా చల్లగా ఉన్నాయ్ చేతులు! (మెలకువ వచ్చినట్లు) ఏదీ, మా శారద!.. ప్రభూ! ప్రభూ!..

లక్ష్మణ: (మేలుకొనుచు) ఎవరు!.. మీరింకను నిద్రింపలేదా!

జయదేవుఁడు: లేదు ప్రభూ! ఈనాఁడు నాకా అదృష్టంలేదు!

లక్ష్మణ: (కూర్చుండి) పండు వెన్నెల ప్రభావం!.. మధుర భావప్రబోధం చేస్తున్నదేమో!

జయదేవుఁడు: కారు మబ్బుల కదలిక ప్రభూ! వసి వాడిన పసిబిడ్డ శారద ముఖచంద్రుఁడీనాఁడు చిఱునవ్వలేదు!

లక్ష్మణ: కలాబాల! శారదను కలగన్నారా!

జయదేవుఁడు: కళాహీనంగా కృశించి కాంతి తరిగిన శారద కన్నులకు కట్టింది ప్రభూ!

లక్ష్మణ: ప్రేమాధిక్యం ఉన్నచోట బాధా శంక కలగటం సహజమే గదా!

జయదేవుఁడు ఇప్పటి నా అనుభవం అలాంటిదికాదు ప్రభూ! ఉపేక్షింపరానట్లున్నది! క్షమించి వేగం నగరంచేరే ప్రయత్నం చేయించండి!

లక్ష్మణ: అలాగే! ప్రభాతంతోనే ప్రయాణం!

జయదేవుఁడు: అందనుక వేచియుండగలమా ప్రభూ! వేఁగుటకెంతసేపగునో యేమో! వెరపు కాలాన్ని మరపింపలేకున్నది! అమ్మాయి ఎలా ఉన్నదో! పరాశరుఁడెంత పరుషంగా మాట్లాడాఁడు ఆనాఁడు!

లక్ష్మణ: మిత్రులు పరాశరులు తాత్కాలికోద్రేకంగలవారు ! అంతే! బహు సరళ స్వభావులు !

జయదేవుడు: కోపం చెడ్డదిగదా ప్రభూ ! అకార్యాలకు ఆటపట్టు. దయ యుంచి అనాలశ్యంగా . . .

లక్ష్మణ: బయలు దేరుదాం ! . . . ఎవరక్కడ !

సేవకుడు: ఆజ్ఞ ప్రభూ !

లక్ష్మణ : ప్రభాతభేరీ వేయించు! వెంటనే పురాభి ముఖంగా ప్రయాణం సాగించాలి !

సేవకు : చిత్తం ! మహారాజా ! ( నిష్క్రమణము. )

జయదేవుడు: వృధా బాధ పెట్టాను! నిద్రా భంగమైందేమో తమకు !

లక్ష్మ: జాగృతిలోనే జయావకాశం ! పరవాలేదు !

( ప్రయాణ ప్రయత్నము )

( తెర జారును. )

---

# పదియవ రంగము

[రాజాంతఃపురము—రాణి, వినయరక్షిత—పద్మావతీదేవి కూర్చుని ఉందురు]

( తెర యెత్తబడును. )

పద్మావతి: అవునమ్మా! మీరన్నట్లు రోజూ యిలాఉండదు !. . . ఎందుకో నిష్కారణంగా ఈనాడు తత్తరించుతూంది హృదయం !

వినయ : అప్పుడప్పుడిలాంటి అనుభవం నాకూ కల్గుతూంటుంది! ఉదయం తోనే ఉదయిస్తుందోనాడు ఉత్సాహం! మరోనాడు మేల్కొన్నంతనే మనస్సేలకో వికలత చెందుతుంది !

పద్మావతి: కాని యిలాంటి ఉద్వేగం ఎన్నడూ యెఱుగను !. . . అమ్మ ! ప్రభువులు వేటకేగి యెన్నాళ్ళయింది

వినయ : నేడో రేపో విజయం చేస్తారు! అల్లుణ్ణి గుఱించిన ఆలోచనలేమో నమ్మా, మీ ఆరాటానికి కారణం !

పద్మావతి: వారిని గుఱించిన ఆలోచనలో ఆనందం గోచరించేది ! మఱీనాడీ అస్వస్థత . . .

వినయ : వ్యాకులానికి కారణాలుంటాయంటారా ! . . . ఎవరు !

భద్రుడు: ( ప్రవేశం ) అమ్మా ! అమ్మా !

వినయ : ఎందుకంత తొందర !

భద్రుడు: ( కంపించుట. )

పద్మావతి: భద్రా ! ఎందుకు నాయనా ! అలా వణకుతున్నావు !

వినయ : వ్యాఘ్రారణ్యాంనుండేనా నీరాక !

భద్రుడు: నోరు రావటంలేదు తల్లీ !

పద్మావతి: అందఱకు భద్రమేకదా !

వినయ : చెప్పు భద్రా! నిన్ను చూస్తూంటే ఏదో భయంవేస్తూంది! త్వరగా చెప్పవు?

భద్రుడు: ఏమని చెప్పేది తల్లీ! ఏటు తప్పిన బెబ్బులి ఒక్క బొబ్బపెట్టి, అయ్యవారిపై దుమికింది! అంతే తల్లి! శ్రీ వారు! (వెక్కి వెక్కి దుఃఖించుట.)

వినయ : భద్రా! . . . జయదేవులు!

పద్మావతి: (రాపడి నిలిచి యుండును)

సేవకుడు: అవును తల్లీ! మనల్ని వదలి వెళ్లారు!

వినయ : హా!

పద్మావతి: స్వామీ! (పడిపోయి, మరణించును.)

వినయ : (ఆదరించి) అమ్మా! దేవీ! దేవీ!.. భద్రా! ఎంత పాడుపని చేశావోయి, అయ్యయ్యో! ఇంత ప్రళయమా తల్లీ! మహాత్ముల మహిమను అంతో యింతో యెఱుగని నా అజ్ఞానం! నన్నే పాప కూపాంతరాల ద్రోస్తుందో! తల్లీ! . . . ప్రభూ! మీ హిత బోధ పెడ చెవిని బెట్టినందులకా యీ ప్రాయశ్చిత్తం! భక్తజన ప్రభావం పరీక్షింపనెంచిన నా వెఱ్ఱితనం నన్నున్మత్తురాలిని జేసినదే! తల్లీ! పతితులను సైతము మీ పాదపద్మపరాగం పవిత్రులను చేయగలగటం ఆశ్చర్యమా అమ్మా! పరాత్పరుని సైతము పరాభవింపగల పతివ్రతల పవిత్ర చరిత్ర వినకుంటినా! నా అహంకారమేనా తల్లీ! అమూల్యమైన నీ ప్రాణపంచకం హరించినది!.. ఇప్పుడు నాకేదిగతి! ఎవరుద్ధరిస్తారు ఈ దుష్టాత్మను!.. ఎవరి కనికారమర్థించటం!.. అమ్మా! నీవేనమ్మా నీ సోదరి అభిమాన ధనం కాపాడగలవు,... జీవితేశ్వరునకు ఈ వార్త తెలిసెనా నా జీవములపై నాకింక ఆశలేదు తల్లీ!... తండ్రీ! జయదేవ కవీంద్రా! కుమతినై కూర్చుండి మీకెంత ఘోరాప

కారం చేశాను! దయామూర్తివి! ఈ అధర్మురాలిని దయఁ జూచేవా!...అమ్మా పద్మావతీ! సతీమతల్లీ! నిన్ను బ్రతికించుకొనఁగలనా! నీపాదములపై వాలి క్షమాభిక్ష అర్థింపఁగల భాగ్యం ప్రసాదింపవా తల్లీ!... నీవున్నాఁడందువే ఆదైవం నన్ననుగ్రహించేనా!

పాట

ఉన్నావా దేవా సర్వోత్తమ పుణ్యపురుష
ఉన్నావా! ఉత్తమజన రక్షా దక్షా! ప్రభూ!
ఎన్నఁడు నిను కొల్వని- ఆ నన్ను ననుబ్రోవఁగ ॥ఉ॥
భక్తుల బ్రోచే-నీ-పావన చరితము
చిత్తముఁజేర్పని దుశ్చింతనురా ప్రభూ!
రాధా మాధవ! ఉన్నవా॥

భద్రుఁడు: (ప్రవేశించి) అమ్మా! జయం! పరాశరపండితులు దర్శనం కోరుతున్నారు!

వినయ: ఎవరు, పరాశరులా! అవశ్యం రమ్మను!

భద్రుఁడు: చిత్తం! (నిష్క్రమణము.)

వినయ: తల్లీ! నీ ఆప్తబంధువు! వీరికి నేనేమి సమాధానం చెప్పఁగలనమ్మా!

పరాశ: (ప్రవేశించుచు) మహారాణిగారికి శుభమగుఁగాక!

వినయ: ఆపద్బంధూ!... (కూలబడి పోవును.)

పరాశ: మాతల్లి పద్మావతి! ఇదేమి మహారాణీ, ఇలాపడి ఉన్నది!

వినయ: నాదుష్ప్రభావ ఫలితం తండ్రీ! నన్ను క్షమించండి! తల్లి పద్మావతి తనువు మాత్రమే మిగిలింది! పరంధామంచేరి పరికించుతూన్నది ఈ పాపిని! ఒక్క-మాట!....పూజ్య శ్రీ జయదేవులకు ఈ వార్త......!

( ప్రభువు — జయదేవుఁడు ప్రవేశించుట )

లక్ష్మణ: భద్రా! ఎక్కడరా! నా తల్లి పడిపోయినది!

వినయ: ప్రభూ! క్షమాభిక్ష! పాపాత్మురాలిని (కాళ్లపైఁబడుట.)

లక్ష్మణ: ఇంకనూ క్షమా భిక్ష!... పాపాత్మురాలా! నాకీర్తి చంద్రికలకు కాలజీమూతమైన నిన్నా క్షమించుట! నిష్కారణముగ నిస్తుల సత్య చరిత్ర ప్రాణాపహరణ మొనరించినందులకా, దయా ప్రసరణము!... ఘోర రాక్షసీ! నిన్నిదే యీ చంద్రహాసమునకు!

జయదేవుఁడు: ( దుఃఖమును తోపనీయక, ఆవరోత్సమునుండి తెలివిపొంది ) ప్రభూ! తెలియని తనం! మన్నింతురుగాక! ..బావా!

పరాశ: బావా! క్షమించరూ!

వినయ: నే నర్థించినది నా ప్రాణభిక్ష కాదు తండ్రీ! అపరాధానికైన అర్హదండనం స్వీకరించటానికి సంసిద్ధంగా ఉన్నాను! నా ప్రార్థన!

లక్ష్మణ: ఇంక నిరర్థకం! కాయకు కాయ చెల్లవలసినదే ఎవరకూడ!

జయదేవుఁడు: మించినది లేదు ప్రభూ! దేవి వినయ రక్షిత క్షమార్హురాలు! అమ్మా! నీవుచేసిన దేమున్నది! శ్రీ కాంతుని చిద్విలాసం తల్లీ! గోలోక ధాముని భూలోక క్రీడలమ్మాయివి! భక్తుల భక్తికి పరీక్షాదశ! పద్మావతి నీ పరీక్షకు ఆగినట్లేనా తల్లీ!

వినయ: అహో! మహాస్వామీ! నాభావం దుష్భావం తండ్రీ!

జయదేవుఁడు: మీ అభిలాష అమోఘ్యమైనదికాదు! పద్మావతి ప్రణయ ప్రభావం ప్రపంచానికి చాటారు! మీమేలు మరువఁగలదా పద్మావతి!

విజయ : నాతల్లి యెదుట కన్పడినగదా నన్ను క్షమించటం !

లక్ష్మణ : మహాభాగా ! సత్య సంకల్పులు, మీకసాధ్యములున్నవా !
పద్మావతీదేవి బ్రతికివచ్చే ఉపాయం ..

పరాశ: బావా! బ్రతికించుబావా ! నాతల్లి లేచివస్తేనేగాని నాతల్లి
శారద బ్రతికేట్లులేదు బావా !

జయదేవుఁడు: పరాశరా! శారదకెలాఉన్నది! మా అమ్మడు కారోగ్యమే
కదూ !

పరాశ : పుణ్య దంపతులు మీరనుగ్రహించి దర్శనమిస్తే యిటు
లేకుంటే......

జయదేవుఁడు: లేకుంటే పద్మావతి లేనట్టే జయదేవుఁడు లేనట్టే ! పరా
త్పరా ! భక్తాధీన !

శా॥ కన్నుల్ మూసినయట్లు కాంచవకటా! కంజాక్షి కన్నోఁడ్చె ! నా
యన్నన్ చూడగదయ్య చయ్యన మహాత్మా ! ఆర్త సంరక్షకా!
మిన్నే వ్రాలెనొ! శీర్షమే విరిగెనో ! మేనెంతయుం గాలెడున్
ఉన్నా నిట్టుల జీవముల్ కలిగి దుర్యోగాప్తి చిత్రాకృతిన్ ॥

శా॥ ఇందీ సుందరి లబ్ధచేతనయు కాదేఁన్ నినున్ మెత్తురే
బృందావీధుల గుండియల్ కలుగునే బింబాస్యముంజూపగా
నందుండేమను ! సీరియేమనును హైన్యంబైన నీకీర్తికిన్
డెందంబందున రాధబెగ్గిలునో ! నేఁడెట్టెట్లు వాపోవునో !

## దండకము

శ్రీమానినీచిత్తమత్త ద్విరేఫా ! లసద్రూప లావణ్య గోపాంగ
నానంగ! భృంగాలకా ! రంగ ! నందాగనా నంద సంధాయ
కా ! కృష్ణ ! గోవింద ! గోపాల ! కుందాంది నానయ్య ! కో
ల్పోతి నిల్లాలి నిల్లాలితాకార; నీపాద పంకేరుహధ్యాన

పారీణ సుస్వాంత, యాకాంత నాకాంత; శ్రీకాంత! పంతం బాగినీ్వడి చింతింప వేరక్ష! శిక్షింప నన్నేమి రక్షోగణాధ్యక్షుగా నెంచితే తండ్రి! చిందింపు కారుణ్య సారమ్ము, పూరింపు ప్రాణమ్ము, పొందింపు భాగ్యంబు! లక్ష్మీశ! లాస్యప్రియా తాండవోద్దండ చండప్రవీణ నమస్తే నమస్తే నమః

[ పద్మావతి వ్రాలిన తీగె లేచినట్లు నాట్య భంగిములోనే లేచుచు జయదేవునకు నమస్కరించుచునే పరవశత్వంలో అష్టపది చరణము అందుకొని నృత్య మొనర్చుట. తక్కిన వారందఱు అద్భుత ప్రకటనము -భక్తి తన్మయతను ప్రకటింతురు ]

వినయ : (పద్మావతి చరణములపై బడుట) అమ్మా !

పద్మావతి: (తెలివివచ్చి, లజ్జా ప్రకటనము, అభయ ప్రదానము)

వినయ : అదృష్టం తల్లీ ! అవతార మూర్తులు ! మమ్మను గ్రహించిన ఆది దంపతులు మీరు!...తండ్రీ! బిడ్డ ననుగ్రహించారు !

పద్మావతి: అవును, బిడ్డ ననుగ్రహించాలి కదన్నయ్యా!...స్వామీ

లక్ష్మణ: మీ ఉభయులపూజ్య ప్రభావం అలోకాద్భుతం ! అమర మూర్తులు మీరు ! మాపుణ్య ఫల ప్రదాతలు ! మమ్మను గ్రహించినట్లే కుమారి శారదను......

వినయ : ఆలస్యం కూడదమ్మా !

పద్మావతి: ఏమండీ ! అమ్మణ్ణిచూచి అనేక రోజులైంది ! ఉండ బట్ట లేకున్నాను !

పరాశ: ప్రార్థించాను బావ! పుత్రికా భిక్ష !

లక్ష్మణ: దయరాలేదా, దయానిధీ !

పద్మావతి: ఏమండీ !

జయదేవుడు: (నిట్టూర్చుచు కన్నీళ్లతో) దైవాధీనం! ... పద్మా! పరాశరా! దుఃఖించకు నాయనా! ప్రభూ, శారద దర్శనానికి......

పరాశ: ఎంతమాట! బాలిక బావా! ప్రాణాలతో మీదర్శనంకోసం ఎదురు చూస్తూంది బావ!

జయదేవుడు: అవును! శారద మహాత్మురాలు! ఆ తల్లి దర్శనంవల్లనే మన జన్మలు ధన్యం...ఆఁ! ఆఁ! శారదా, శారదా! వచ్చేస్తున్నానమ్మా! (నిష్క్రమణము.)

(తెర జారును.)

—— :0: ——

## పదునొకండవ రంగము

(పరాశరుని గృహం—రాధా కృష్ణ మందిరము ముందు శారద. లేవలేక లేవలేక లేచి కూర్చుండును.)

శారద: (కృష్ణుని ఉద్దేశించి) ఈనాఁడే నా శుభలగ్నం! నీ దివ్యమంగళ విగ్రహం శతకోటి సూర్యప్రకాశంగా వెలుగొందటం చూచాను! నీ ప్రభావాభ్ర గంగలో మునిగాను! పునీత నైనాను! అందుకే కాబోలు- ఈ క్రొత్త బలం- ఈ క్రొత్త ఉత్సాహం! శరీరం సన్నగిలినా - చైతన్యం సారవంతంగా ఉంది ప్రభూ!... అవును. నా అందచం చాలుకావు నీకు కావలసినవి, నా హృదయ మొక్కటే నీవు కోరేది! అది...ఏనాఁడో అర్పించాను! ఇప్పటికి నాన్నా అనుగ్రహించారు! మిగిలిందొక్కటి!...నీ ప్రతిమూర్తి- మామయ్య - జయదేవులు! వారి దర్శనభాగ్యం!... రాధా రమణీయ మూర్తి మా అత్త, పద్మావతీ దేవి! ఆమె పాదపూజ మాత్రమే! నీలోనూ వారిని దర్శించాను! వారిలోనూ భావించిన పరమసత్యం దర్శించటం ఒక్కటే కొఱంత! ఇహ పరాలు రెండింటను నీ ప్రేమానుభవం చవిజూచాను! ఇంక నాకేమి భయం! నిర్భయం!... నిర్భరానందం!... ఇవే నిన్ను చేరిన తర్వాత నాకున్న నిశ్శ్రేయసం - నిక్షేపమూను! ప్రభూ! భక్తమందారా! శారదా హృదయ మందిరా!...నీ వియోగంలో ప్రతిక్షణం మహాయుగం స్వామీ! రాధే కృష్ణ! - రాధే కృష్ణ! రాధే కృష్ణ! (పరవశత్వం)

(అందఱూ ప్రవేశింతురు)

పద్మావతి: అమ్మా! శారదా!

పరాశ: నా పుణ్యాల ప్రోవు...ఎలా పడిపోయిందో చూచావా బావా!

జయదేవుఁడు: దిగులందకయ్యా! శారద సామాన్య బాలిక కాదు బావ!

పరాశ : ప్రభూ! మా బంగారు పాప బ్రతికేనా ! ... నాపాపం పండ్లైందీనాటితో !

లక్ష్మణః సర్వం తెలిసిన మీరే యిలా అధైర్యపడితే !

పరాశ : నా తెలివి తెల్లవారినది ప్రభూ ! అయ్యో దైవమా !

జయదేవుడు: (శారదను ఒడిలో నుంచుకొనుచు) శారదా! మామయ్యనమ్మా! ... పలుకవూ! అదో ... మీ రాధత్తయ్య ! పద్మా ! పలికి పలికించవే నీ శారదను!...నాపై అలకా తల్లీ !
"నమస్సుమంబిదె హరేహరే! మనస్సు మంబిదె హరేహరే"

(ఉచ్చైస్స్వరంతో పాడుట)

శారద: (కదలి అటు నిటు చూచును)

పద్మావతి: తల్లీ !

శారద : (పద్మావతిని ముఖములోనికి చూచుచు) రాధ ! ...... అత్తయ్యా! (జయదేవుని గుర్తించి) ప్రభూ ! రాధా మాధవ ! (రాణివంక తిరిగి) దేవీ !

(లక్ష్మణసేనునివంక చూచుచు నమస్కరించుట)

(జయదేవునితో) నాన్న ఏరి మామయ్యా !

జయదేవుడు: నీకై కుమిలిపోతున్నాడమ్మా!.... బావా! శారద పిలుస్తూందయ్యా !

పరాశ : ఇంకేముఖంతో చూడను తల్లీ ! ఇన్ని కష్టాలు చేజేతుల తెచ్చానమ్మా నీకు! నీ ప్రణయభక్తి అర్థంచేసికోలేని మూర్ఖుణ్ణయినాను తల్లీ ! (చేతులు పట్టుకొనుచు) క్షమించమ్మా !

శారద : నాన్నా ! నాగోపాలుడప్పుడే క్షమించారు నాన్నా ! మీ చేతులతో నన్నర్పించండి .... కన్యాదానం నాన్న ! .... ఏం మామయ్యా ! కళ్యాణానికిముందు కనిపింప కూడదనుకొన్నారా !

జయదేవుఁడు: లేదమ్మా! నే నెక్కడున్నా ప్రాణమంతా యిక్కడే ఉంది తల్లీ! మీ అత్తయ్య నాకూ నాదైవానికి పరీక్ష పెట్టిందమ్మా!

వినయ : (తలవంచుకొని) తలపోయే తప్పులుచేసినా తప్పించారమ్మా నీ రాధా మాధవులు !

శారద : నే నానాఁడే చెప్పాను మహారాజ్ఞీ, మా అత్తయ్య అమృత మూర్తి అని! ... అమ్మా-అత్తయ్యా! ప్రభువు - బృందావన గోపాలుఁడు కరుణించాఁడు! మామయ్యా! ఔనంటారా! (చిఱునవ్వి) న్వా! మాయా మానవ మూర్తులు! తెలిసికొన్నాను మీ మీ ప్రభావం! .... నాన్నా! మీ ఋణం ఎలా తీర్చుకోను!.... మహారాజులు! మీ అభిమానం ... అమ్మా వినయరక్షితాదేవి! మీ వాత్సల్యం .... మఱువనమ్మా! .... అదోవిమానం! దివ్యధామంనుండి విమానం! ... ఎలా అలంకరించారా విమానం! ... ఎంతటి శోభ! ... ఏమది! నామనోహరుని మధుర మంజుల మురళీ స్వనమే! .. పిలుపా ప్రభూ! ...

పరాశ : (నోటిలో గుడ్డ పెట్టుకొని) అమ్మా! శారదా! నన్నన్యాయం చేస్తున్నావే తల్లీ! .. శారదా!

పద్మావతి: అమ్మడూ! మేం కనిపిస్తున్నామా అమ్మా! ... మీ మామయ్యను చూడు తల్లీ! ఎలా అయిపోయినారో! ..

జయదేవుఁడు: (కన్నీళ్లతో—రెప్ప లార్పక మీదు చూచుచునే) అద్భుతం తల్లీ, నీ చరిత్ర! పరంధామంనుండి పరాత్పరుఁడు పాణిద్వయం చాచి అక్కున జేర్చుకొనే ఆతృతతో ఉన్నాఁడమ్మా! ... (భగవంతు నుద్దేశించి) అమరేంద్రాది వందిత పాద పంకేరుహా! ... ఆర్తార్తి హారా! మురహరా! ముకుందా!

శా॥ నైకుంఠేశ్వర! ఈశ్వరా! వరద! నీబాంధవ్యముంజూపి, వే
మాకీవే నినుగొల్చు భాగ్యము, మహాత్మా! అల్లుఁడై ఆత్మనా

లోకింపందగు నెయ్య వియ్యముల, మాలోపమ్ములంద్రోచియే
గైకోవచ్చును, కన్యకన్, మణినిభ కైవల్య భిక్షార్థినిన్॥

పరాశ : (కుములు చుండుట)

పద్మావతి: అమ్మా! ఎలా అయిపోతున్నావమ్మా, శారదా !... శారదా!

వినయ: (ఓదార్చుట) ఊరుకోండి !

లక్ష్మణ: (పరాశరునితో) శారదను కన్నారు! ధన్యాత్ములు!.. సహజమే అయినా దుఃఖం ఆపుకోవాలి !

పరాశ : బావా !

జయదేవుడు: అమ్మా!...మమ్మనుగ్రహించు తల్లీ!.. బావా !

శారద : ఇంకా సందేహమా, ఇందిరా రమణా!. ఇదోవస్తున్నాను!.. నాన్న!.. అనుజ్ఞ!.. ఏవీ మీపాద పద్మాలు !

పరాశ : తప్పుతల్లీ ! నీవు మాశిరోమాణిక్యానివి ! వంశం పావనమైంది! నీజన్మతో!.. ఇదేమిటి బావా!.. శరీరం పులకరించుతూంది. అయ్యయో ! దుఃఖ సమయంలోనా ఉవ్వెత్తుగా వచ్చే యీ ఆనంద తరంగం!.. బావా ! శారదా!.. అమ్మా!.. పద్మా! నేనెలా ఉన్నాను !

శారద : చూచారా ! మంగళాంతం చేయాలనుకొన్నారు నాన్నా, నా జీవితం ! నన్నందు కొంటున్నాడు నాన్న నందకిశోరుడు !.. ప్రభూ ! అమ్మో ! ..అంతెత్తు ఉండగలనా ! ఆఁ ! ఆఁ ! ఏదీ మీచేయి! గట్టిగా పట్టుకో ప్రభూ ! జారవిడిచేవు!... అమ్మ! ఇది.. నీవక్షస్థలమా ప్రభూ ! ఈ వనమాల ... హాయిగా .. హాయి.. కృష్ణా ! కృష్ణా, కృష్ణ ! (మరణించును.)

జయదేవుడు: (అంజలి ఘటిస్తూ ప్రదక్షిణ సారిగా) అమ్మా !
ఏదారి నీవు చూచుకొన్నవా తల్లీ మాకేదారి చూపావమ్మా! (ప్రదక్షిణించి) సెలవు తల్లీ!... ప్రాపంచిక సంబంధ మాధుర్యా

నుభవించాలు!... ఇంక విశ్వేశ్వరుని విశ్వరూప విలాసాలు వీక్షిస్తూ, ఆ శ్రీనివాసుని సేవలోనే తపించి తరించాలి! .. పద్మా!

పద్మావతి: (శారదకు ప్రదక్షిణించి) సెలవు తల్లీ !... భక్తి జ్ఞాన వైరాగ్యాలు నేర్పావమ్మా నీ జీవితంలో !... స్వామీ! ఆజ్ఞ !

జయదేవుడు: (రాజుతో) ప్రభూ! మిత్రుని మరువకుందురుగాక ! (రాణితో) తల్లీ! సెలవు!... పరాశరా! వెళ్ళొస్తాను నాయనా! ఆబాల్యము అన్నదమ్ములుగా మెలిగాం ! సుఖ దుఃఖాలు సమానంగా పంచుకున్నాం ! ఎడబాటులోని బాధా మాధుర్యమూ చవి చూడాలి !

పరాశ : చూచారా ! ప్రభూ ! బావ మాటలు !

లక్ష్మణ: మహాత్ములు వారు!... తామర పత్రాల్లాగా సంసారంలో మెలిగారు! కష్టసుఖాలు వారిని కదలించినా అతీతానుభవం పొందిన అదర్శ మూర్తులు ! ... ఏమనగలం ...! మహాత్మా ! ... కర్తవ్యమూఢులం !

జయదేవుడు: పుణ్య చరితులు ప్రభూ! మీరందఱు మాకనుజ్ఞ ..!

పద్మావతి: (రాణితో) అమ్మా ! .... ముద్దుగా పిల్చుకొంటున్నానమ్మా వినయా! అనుజ్ఞాపించమ్మా ! ... భర్తతోడిదే జీవనమమ్మా భార్యకు! వారెక్కడో... నేనూ...

వినయ: గుణ బోధనం తల్లీ! తెలిసికొన్నాను నన్ను మఱువకమ్మా! (జ. దే.తో) తండ్రీ !

జయదేవుడు: పుత్ర పౌత్రాభి వృద్ధిరస్తు తల్లీ !... పరాశరా ! ప్రభూ !-

( నిష్క్రమించుచుండగా రాజు, రాణి అనుసరింతురు. )

పరాశ: (గుండె బ్రద్దలగునట్లు)

శా॥ భావా! యొంటిగ నిల్చిపోయితే! ననున్ పాపాత్ము నీభూమిపైఁ
బ్రోవంగల్గెడు వారలెవ్వరిటుపై బోధించి సన్మార్గముల్!
నీవేలేవ మదంబ పద్మ! నను నన్నే భంగులం దిద్దఁగా!
జీవాధారము కన్నకూఁతురిదియున్ చెందెన్ గదా మోక్షముల్॥

మ॥ భరియింపన్ ఫలమేమి ప్రాణములు దౌర్భాగ్యంబు ప్రాపింపఁగా
వరియింపంగల భాగ్యభోగ్యములె కావా భారమీ జీవికిన్!
చరియింపందగు సత్పథంబులవియున్ సంధించునే యోగ్యతల్!
కరయంబిది మృత్యువాతఁబడుటే కల్పాంతదుష్కీర్తికిన్॥

( వా పోవు చుండఁగా తెరజారును. )

( స మా ప్త ము )

గ్రంధకర్త నుండి వ్రాతపూర్వకమైన అనుమతి పొందనిదే ఈ నాటకము నెవ్వరు ప్రదర్శింపరాదు.
సర్వ హక్కులు రచయితవి.

ఈ పుస్తకము దొరుకు చోట్లు:

**శ్రీ దత్త ప్రెస్సు**

ప్రింటర్సు & పబ్లిషర్సు

3466 రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాదు.

**శ్రీ భట్టిప్రోలు జయరామారావు**

2259 కంజర్ గూడ, సికింద్రాబాదు.